శ్రీరస్తు.

# రాజశేఖరవిలాసము.

కూచిమంచి తిమ్మకవి ప్రణీతము

ప్రకాశకులు

పసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు,

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

స్టైటిల్ షేజి దేశబంధు ముద్రణాలయమున ముద్రింపబడెను.

రాజమండ్రి.

 [వెల 1—0—0

1926

# శ్రీకృష్ణదేవరాయచరిత్రము.

ఏమహావీరరసపూర్ణునోట "దేశభాషలందు తెలుగు లెస్స" అను మహావాక్యము నిత్యము జపింపబడుచుండెడిదో, ఏమహారాజుకీర్తి ఆబాలగోపాలముచే నుతింపబడుచున్నదో, ఏమహాపురుషుడు అరిపీకంఠలుంఠన ప్రశస్తుడో, ఏమహాప్రభువు కవులకు కల్పతరువై, ఆశ్రితులను ఆనందదాయకుడై, తనయశోడిండిమము దశదిశల మ్రోగించుమించెనో, ఏమహావీరుని మోము త్రిభువనైకసుందరమో, ఏసార్వభౌముని యాస్థానమునందు అష్టదిగ్గజంబులు తమప్రశస్తిని గనబరుచు కవితావిజయముల సంపాదించెరో, అట్టి స్వాతంత్ర్యమంటపప్రదీని, సౌందర్యవార్థిచంద్రుని సమదారాతిద్రుమకుఠారకుని చరిత్రము విచిత్రము. చదివి విని యానందింపుడు.

దీనివెల రు 1—0—0

## పూర్వకవుల ప్రబంధములు

పారిజాతాపహరణము వెల 0—12—

ముక్కు తిమ్మన్న ముద్దుపలుకులు.

శృంగారనైషధము వెల 1—0—0

(పూర్వకవి) శ్రీనాథ విరచితము.

శశాంక విజయము

(పూర్వకవి) శేషము వెంకటపతి ప్రణీతము.

వైజయంతీవిలాసము

అను విప్రనారాయణచరిత్ర. వెల 1—0—0

వలయువారు— వనుపులేటి వెంకటరామయ్య అండ్ బ్రదర్సు,

బుక్కుసెల్లర్సు, అండ్ పబ్లిషర్సు

ఇన్నీసుపేట—రాజమ

శ్రీరస్తు.

# రాజశేఖరవిలాసము.

శ్రీనగజా తనుద్యుతులు చెల్వమిఱుంగులుగా వియన్నదీ
ధ్వానము లెల్ల గర్జితకదంబముగా రజతాచలాంబరా
స్థాని వసించు శర్వజలదంబు కృపారసధార మీఱ మ
న్మానసబర్హి నెంత యుఘనంబుగ సంతస మొంద జేయుతన్.

చ. కరిముఖుఁ గన్నతల్లి శశిఖండవిభూషణుమూర్తిరాణి భూ
ధరవరు ముద్దుపట్టి నిజదాసగృహాంగణకల్పవల్లి కి
న్నరగరుడోరగాద్యమరనవ్యకిరీటమణి ప్రభాతిని
స్ఫురితపదాబ్జ యాత్రిపురసుందరి మాకు నభీష్టమిచ్చుతన్. 2

ఉ. వల్లవపల్లవాధరు లవారితభక్తిని బాలుఁ డంచుఁ ద
న్నెల్లనఁ బిల్చి యెంతయును మే లగు గ్రొవ్విరిబాళ్సంగఁ దా
నెల్లక యల్ల కప్పికొని యుంచినబంతు లొసంగు మంచు భా
సిల్లుకుచంబు లంటుచు హాసించు ముకుందుఁ డభీష్ట మిచ్చుతన్. 3

గీ. కమలజార్చిత మృదుపదకమల యైన
కమల మాయింట నేప్రొద్దు కడుముదమున
నిలిచి యభిలషితార్థముల్ గలుగఁ జేసి
చిరతరం బైన కృపను రక్షింతుగాత

క. ఎంచఁ దగునంచ తేజిని
జంచలగతి నెక్కువాణి

డంబితమతిచే దానొన
రించుంగావుతను మాకుఁ బ్రేమస్ శుభముల్. 5

సీ. వేదాదివిద్యల వెలయించుపూఁబోణి
నెఱి భక్తతతిఁ బ్రోచు నీలవేణి
యురుకవిత్వప్రౌఢి యొనఁగూర్చుకళ్యాణి
మహనీయపుస్తక మహితపాణి
నిఖిల గీర్వాణవర్ణిత సద్గుణశ్రేణి
నిజలోచనప్రభానిర్జితైణి
ఘనతరోత్తుంగ సైకతసన్నిభశ్రోణి
రాజీవభవుని గారాబురాణి

తే. సమదపికవాణి యవ్వాణి సంతసంబు
మదిని దైవార రచియించుమత్ప్రబంధ
మరసి దుర్దోషరహిత మానట్లుగాను
జిరకృపాస్ఫూర్తిఁ బరిపూర్తి చేయుఁగాత. 6

చ. పొలుపుగ నీలకంఠమునఁ బూనినయట్టి కపాలమాలికల్
వలనుగఁ జూచి దొప్పలుగ వండినయుండ్రము లంచు భ్రాంతిలో
పల జనియించి తుండమునఁ బట్టి వడిం దివియంగఁ జూచు వి
ద్యలగురుఁ డేకదంతుఁడు ముదంబున మత్కృతిఁ బ్రోచుఁగావుతన్.

ఉ. రవి శశి భౌమ సౌమ్య సురరాడ్గురు భార్గవ మంద రాహు కే
తువు లనఁ బేరుఁ గల్గి యలతోయజగర్భసురేంద్రముఖ్యులౌ
దివిజుల కెల్లఁ గోరిక లతిస్థిరమానసులై యొసంగుచున్
భువిని బ్రసిద్ధులైన గ్రహముల్ మముఁ బ్రోతురుగావుతం గృపన్.

క శైవలంబులఁ గటిసైకతంబుల
కములను

లాలితబాహుమృణాళనాళంబుల
నిరుపమలోచనేందీవరములఁ
గమనీయతరపాద కహ్లారదళముల
మానైన దరహాసఫేనములను
బంధురకరతలపంకేరుహంబుల
వరవళీవీచికావ్రాతములను
తే. భాసిలుచు నుండు గిరిజావిలాససరసి
నమరఁ గ్రీడించు గిరిశహంసము మదీయ
దురితనీరంబు దిగనాడి నెరిని సుకృత
దుగ్ధముల గైకొనెడుఁగాతఁ దూర్ణగతిని. 9

సీ. ఆశాంతవిదిత పుణ్యశ్లోకు వాల్మీకు
నఖిలశాస్త్రాగమాభ్యాసు వ్యాసు
భాసురకవితా ప్రభవభూతి భవభూతిఁ
జారుతరాతియశోరుఁ జోరు
వీరారి భుజగమయూరు మయూరుని
బంధురలేపపుష్పబాణు బాణు
నసమవిద్వన్మనోహర్షుని శ్రీహర్షు
సారవాక్యక్రమశ్లాఘు మాఘు
తే కలితవిద్యావిసముల్లాసుఁ గాళిదాసు
బుధజనానందకరముఖాంభోజు భోజు
మఱియు గీర్వాణకావ్యనిర్మాణచతురు
లగుకవీంద్రులఁ బ్రార్థింతు నగణితముగ. 10

ఉ. రమణన్ నన్నయభట్టుఁ దిక్కమఖి నెఱ్ఱాప్రెగ్గడన్ భాస్కరుం
గ్రమ మింపొందఁగఁ బోతనార్యుని లోకఖ్యాతుఁ జిమ్మపూ

డమరేశునన్ ఘను భీమసత్కవిని దక్షుం బొప్ప శ్రీనాథము
ఖ్యమహాంధ్రాంచితకావ్యకల్పకుల నేఁ బ్రార్థింతు నెల్లప్పుడున్.

సీ. గురుతర కౌండిన్యగోత్రవిఖ్యాతుండు
బయ్యనామాత్యుఁ డేభవ్యతాత
నిరతాన్న దానవర్ణిత యశస్సాంద్రుండు
తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగన్నయు నరసన్న
యనుమువ్వ రేమంత్రియనుఁగుఁదమ్ము
లలరఁ దిమ్మన్న రాజన్న జగ్గన్నయు
సూరన్న యేమంత్రిసుతవరేణ్యు
తే. లొనర వీరమ పాప మేఘనునిసహజ
లతిపతివ్రత లక్ష్మి యేచతురరాణి
యట్టి శ్రీకూచిమంచి వంశాబ్ధివిధుని
మజ్జనకు నల గంగనామాత్యుఁ దలఁతు. 12

కం. ఛందమునుం గావ్యాదుల
చందము నింతైన నెఱుఁగ సతతము విద్వ
ద్బృందంబులకృపఁ గవితా
సందర్భంబూగి నొనర్తు సాహసవృత్తిన్. 13

చం. ఎనయఁ బ్రసూనదామ మెవరేక్రియఁ గూర్చిన నందుఁ గల్గువా
సనలకుఁగాదె మానవులు సంతసమందుదు రుర్వి నట్టిపా
వనతరశంభుభక్తి యనువాసనకు న్మది మెచ్చి మత్కృతిం
గనుఁగొని తప్పు లెన్నక తగం గరుణింపుఁడు సత్కవీశ్వరుల్. 14

వ. అని నిఖిలవిబుధ విబుధ వినుతిం గావించి మఱియు నిష్టదేవ
తాప్రార్థనంబు జేసెన.

సీ. శ్రీమద్గిరీంద్రజాచిత్తసరోహంస
హంససహస్రదివ్యప్రతాప
తాపసానేకసంతతరక్షణాధ్యక్ష
యక్షేశసఖ దక్షయాగహరణ
రణరంగరిపునాశ రజతాచలనివాస
వాసవార్చితపాదవనజయుగళ
గళమూలభూషణలలితహాలాహల
హాలధరానుజ సన్నుతార్జునాంగ
తే. యంగసంభూతమథన సత్యప్రచార
చారణామరపోషణ సతతవిభవ
భవవిరూపాక్ష యోగిహృత్పద్మపీఠ
పీఠపురికుక్కుటేశ కిల్బిషవినాశ. 16

సర్వలఘుసీసము.

తరుణశశిభరణ సువితరణ భయహరణకర
యరుణ సరసిరుహనిభ చరణయుగళ
మదనమదమథన ఘనకదనతలవిజయ గిరి
వదన జగదవన కరివదనజనక
వనజభవదమన పురదనుజకులశమన ముని
మనుజసురవరద ప్రతిదినవిలసిత
బహుళతరవిభవ రిపుగహనదవదహన పటు
విహగపతిగమననుత మహితచరిత
ధరణిరథ తరణిశశిసదృశ హరతినయన
గరళగళ ధనదసఖ శుభద గదనచికుర
వరసుగుణనికర మృదుహృదయ శరధిశరధి
యురగవరభరణధరపరమపురుష గిరిశ. 17

క. దుర్గాధినాథ దివిజని
వర్గార్చితమృదులపాదవనరుహయుగళా
గర్గాదిమౌనిసన్నుత
భర్గా శ్రీకుక్కుటేశ భవ్యవిలాసా. 18

చ. విను మఖిలేశ మర్త్యులకు వేడుకఁ గావ్య మొసంగి ధాత్రిపై
నొనరఁగ సౌఖ్యసంపదల నుద్ధతులై సుకవీంద్రు లుందు రా
ర్యనికరవంద్య నీ విహపరంబుల సౌఖ్య మొసంగుసామి వం
చును మది నెంచి నీకు సరసుల్ విని మెచ్చఁ బ్రబంధ మిచ్చెదన్.

ఆ. తప్పు లున్నయెడల నొప్పులుగా నెంచి
పూని కావ్య మొనరఁ బూర్తిచేసి
కరుణమీఱ మాకుఁ గామితార్థములెల్ల
ఘనత నొసఁగి యేలుకొను గిరీశ. 20

క. అని విన్నవించి యాతని
ఘనతరకరుణావిశేషగౌరవమున నే
నొనరించెద నవ్విభునకు
జను లెల్లను బొగడఁదగిన షష్ఠ్యంతంబుల్. 21

క. ధీరునకు భక్తజనమం
దారునకు సురారిమదవిదారునకు మహో
దారునకు నఖిలజగదా
ధారునకు నఘౌఘవారిదసమీరునకున్. 22

క. సోమునకు రజతభూధర
ధామునకు నుదంచితాహిదామునకు నయో
ద్దామునకుఁ బ్రకటసద్గుణ
ధామునకున్ మౌళిశీతధామున కెలమిన్. 23

క. ధవునకు శోషితసరసిజ
భవునకు నగణితలసద్విభవునకు గౌరీ
ధవునకు వృషభేశ్వర సైం
ధవునకు గిరిబాంధవునకు ధవళాంగునకున్. 24

క. శూలికి విమలదయాసం
శీలికి జగదైత్యచర్మచేలికిఁ బురని
ర్మూలికిఁ బరిపాలితదివి
జాళికి నతహృత్పయోరుహాళికి భక్తిన్. 25

క. స్థాణునకు నురుచతుర్భుజ
బాణునకు జితప్రసూనబాణునకు బుధ
త్రాణునకు నిరతపోషిత
బాణునకున్ సత్యవాక్యపారీణునకున్. 23

క. నరకిన్నరవిద్యాధర
గరుడోరగ సిద్ధసాధ్య గంధర్వసురా
సురపూజిత చరణునకును
హరిణాంకనిభప్రకాశునకుఁ బశుపతికిన్. 27

క. భృంగిరిటనాట్యరతునకు
సంగరవిజయునకుఁ బాణిసారంగునకున్
గంగాధరునకు నబ్ధిని
షంగున కుర్వీరథునకు జగదధిపతికిన్ 28

క. యక్షాధీశ్వరసఖునకు
నక్షీణలసత్కృపాకటాక్షునకు గణా
ధ్యక్షప్రియునకు విదళిత
దక్షాధ్వరునకును ధర్మతాత్పర్యునకున్. 29

క. హరునకు గాంచనధరణీ
ధరకోదండునకు మృత్యుదర్పహరునకీ
శ్వరునకుఁ బీఠాపురమం
దిరకుక్కుటలింగమునకు దివ్యాంగునకున్. 30

వ. అనంతసాష్టాంగదండప్రణామంబులు సమర్పించి యద్దేవతా
సార్వభౌమునకు నంకితంబుగఁ దత్కృపాతిశయమున నాయొనర్పం
బూనినయట్టి రాజశేఖరవిలాసంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 31

కథారంభము.

ఉ. శ్రీకరలీలఁ దొల్లి మునిసింహు లనేకులు నైమిశాటవిం
బ్రాకటరీతి సూతుఁ గని పల్కుచుఁ బ్రార్థనఁ జేసి యెప్పుడున్
లోకములందు యోగిజనలోలుఁ డుమాపతి తత్కథావళుల్
చేకొని పల్కఁగ వినినఁ జేకుఱు సౌఖ్యము లెట్టివారికిన్. 32

సీ. అసమానఘోరదుఃఖారణ్యములకుఁ బ్ర
జ్వలితాగ్నికీలలు శంభుకథలు
ఘనతరాఘౌఘాంధకారంబులకు లస
జ్జలజాప్తబింబముల్ శంభుకథలు
గాఢామితోగ్రదుష్కర్మోరగములకు
సమదమయూరముల్ శంభుకథలు
అపమృత్యుముఖ్యదోషాంభోధరములకు
ఝంఝానిలంబులు శంభుకథలు
తే. సజ్జనస్తోత్రపాత్రముల్ శంభుకథలు
సకలసంపత్కరంబులు శంభుకథలు
శాశ్వతైశ్వర్యయుక్తముల్ శంభుకథలు
సవనఫలదాయకంబులు శంభుకథలు 33

తే. గిరిశకథలందు నీవు నేర్పరివి మున్ను
శంభునకు వేశ్యగాఁ బ్రియసతి నొసంగి
యతనికారుణ్యమునకుఁ బాత్రతవహించి
నట్టిమనుజేంద్రుకథ దెల్పవయ్య మాకు. 34

క. అనవుడు సూతుఁడు మునులం
గనుఁగొని వెనసిట్టులనియె గౌరీశుకథల్
వినిపించెదనని పూనఁగ
జనులకుఁ దరమగు నె యోగిసంఘములారా! 35

శా. వాణీశామరవల్లభాదు లగుగీర్వాణుల్ నిజంబొప్పన
య్యేణాంకార్ధవిభూషణుం దెలియఁగా నింతేనియుంజాలరీ
క్షోణిన్ మానవుఁడెట్లునేర్చు దృఢభక్తుల్ గొందఱాచక్రభృ
ద్బాణుంగాంతురు సత్కథావళులునిత్యంబుం బ్రశంసించుచున్. 36

క. ఘనుఁడగుపినాకిచరితలు
వినయవివేకజ్ఞుఁడగుచు విలసిల్లెడుసూ
తునికిం దెలిపినవిధముఁ
బనివడి యితరులకుఁ దెలియఁబలుకు టెట్లరయన్. 37

క. ఘనశైలంబులు ముంచెడు
వననిధిలో నోడ నిలిపి వడి నీఁదెడు మ
ర్త్యునికరణి భక్తియను నా
వను గిరిశకథాసుధార్ణవ మీఁదఁదగున్. 36

తే. అట్లు గావున నతినిపాదాబ్జయుగము
భక్తితోఁడుతమదినిల్పి ప్రకటగతిని
మీరలడిగినకథలెల్ల గోరికలర
నెఱుఁగఁబలికెద వినుఁడని యిట్టులనియె. 39

క. శ్రీకరమై రిపుజనహృ
ద్భీకరమై త్రిభువనప్రథిత శివమతిర
త్నాకరమై యనవరతశు
భాకరమై సింధుకటక మనుపురి వెలయున్. 40

మ. శశికాంతోపలజాలనిర్మితమహాసౌధాగ్రభాగోల్లస
ద్విశదాబ్జారిముఖీజనాంచితముఖావిర్భూతమందస్మితా
తిశయప్రస్ఫుటకౌముదీముషితహృద్దేశానికోద్యచ్చకో
రశకుంతావళియై తనర్చుఁ జెలువారన్ దత్పురం బెంతయున్. 41

చ. అరయఁగ నప్పురిం గనకహర్మ్యతలంబులఁ గేళిసల్పు సుం
దరులయొయ్యారముల్ గని ముదంబున నచ్చరలెల్లమెచ్చి భా
సురగతిఁ గాన్క లంపిన ప్రసూనవుదండ లనంగ నెల్లెడం
దఱచుగ రత్నతోరణకదంబము లందముమీఱు నెప్పుడున్. 42

మ. లలనల్ తత్పురిసౌధవీథులను డోలాకేళిచే నుండి తా
రల బాలార్కుని మింటఁ జూచి తమపాదాబ్జద్యుతింబోలరాఁ
గలకెందమ్మి యటంచుఁ బాదములఁ ద్రొక్కన్ దంతముల్ రాలియ
ట్లలరెంగాదె సహస్రపాదుఁ డనుపే రాహాసరస్వామికిన్. 43

తే. నాగరులు మేన నలఁదిన నవ్యచంద
నాగరుల సౌరభానిలం బానుచున్న
చంచరీకాళులో యనుసరణిఁ బొదలుఁ
బురివితానాంచలాంచిత సురపమణులు. 44

చ. మరకతరత్నసంఘటితమానితకుడ్యకదంబజాలకాం
తరముల నుండి వేవెడలు తద్ఘనసారపుధూమధూమమున్
పరువడిఁ జూచి నీలఘనపంక్తు లటంచు నటించు నెంతయున్
గుఱుతుగ మేదినీస్థలిని గోర్కెలచే శిఖినీసమూహముల్. 45

మ. నెల యప్పీటను గోటచాటుఁ జనుచో నీ టొప్ప నర్కోపమో
జ్జ్వలపంకేరుహరాగరత్నసురుచివ్యాప్తిం బ్రకాశించుని

వ్యాలిచెంతన్ బరిఘాంతరాంబుజతతుల్ వ్యాకోచభావంబుచే
నలరుం బున్నమఱేలు తన్మెఱుచుల్ హంసాళులన్ భ్రాంతిచేన్.

ఉ. గట్టిగ వెండిబంగరపుగట్టులె యిల్లును విల్లుఁ గాఁగఁ జే
పట్టియు భిక్షుకుం దిరుగుభర్గుని దేటివిభూతియంచుఁ బె
న్గట్టుల మించువిత్తములఁ గ్రిక్కిన వెచ్చము చేయుచుందు ర
ప్పట్టణమర్త్యసంఘములు భవ్యవిభూతిఁ జెలంగి యెప్పుడున్. 47

క. వేడుక నజుతో వాదం
బాడఁ బులకితాంగు లగుదు రప్పురిలోనం
బాడబులు దురితజలనిధి
బాడబు లని జగము లెల్లఁ బ్రస్తుతిసేయన్. 48

క. మారునియాకారముఁ బలు
మాఱును నిరసించు రాకుమారులు వీటన్
మాఱెందు లేక వడిఁ బరి
మాఱుతు రరివరులఁ దృణముమాఱుగ నెపుడున్, 49

క. ధనదుఁ డనుపేరమాత్రము
తన కబ్బెంగాక పిలిచి ధన మెవ్వరి కి
చ్చెను యక్షుఁ డంచు నెంచుచు
ధనమిత్తురు బుధులఁ బిలిచి తత్పురివైశ్యుల్. 50

క. ధరణీసురాంఘ్రిసేవా
నిరతులు శ్రీకంఠభక్తినిపుణులు రిపుకుం
జరసముదయహర్యక్షులు
సురుచిరయశు లందుఁ గలుగుశూద్రజనంబుల్. 51

సీ. వలనొప్ప నీదండ వలె నింతి మా కన్న
దండ గావలె నేని యుండుకొనుము
కనుఁగొనియెద బంతు లొనర నిమ్మిపు డన్న
గోరంటబంతులఁ గోరుకొనుఁడు

మారుబేరము లింక మా కెట్లమరు నన్న
మరుమాట మేలగు మా యెడలను
నునుమోవిచివురునకును వెల యెంతన్నఁ
బ్రియ మంచు దీనికిఁ బెనఁగఁదగునె
తే. యనుచుఁ దముఁ జేరి నెఱదంటతనముమీఱఁ
బలుకునలకోడెకాండ్రకు బ్రతివచనము
లొసఁగుచును బువ్వులమ్ముచునుందురందు
నందముగ నెప్పుడును గొంద ఱిందుముఖులు. 52
సీ. అలకంబు లలరించి తిలకంబు లొగి ఫాల
ఫలకంబులను ముద్దుగులుక దిద్ది
యందంబు లగుమంచిగందంబు లెక్కు డా
నందంబులో గుబ్బలందు నలఁది
సింగారముగ మేల్మిబంగారుతొడవులు
పొంగారువేడ్కచేఁ బొసఁగఁ దాల్చి
బలువైనవిలువచేఁ జలువైనసన్నంపు
వలువలు రింగులు వారఁ గట్టి
తే. యంగభవకేళిఁ గోరి దాయంగవచ్చు
పల్లవులమానసంబులు పల్లవింపఁ
బొందుమీఱంగ విహరించుచుండు రెప్పుడు
వారకామిను లందు నవారితముగ. 53
శా. శుంభద్విక్రమరూఢిచే బలుమఱుఁ శోభం బ్రకాశించున
జ్జంభద్వేషణుచేతివజ్రమునకున్ శంకించి చంచత్కృపా
రంభుం డావిభుచెంతఁ జేరినమహీధ్రశ్రేణు లన్నైకవడిన్
గుంభీంద్రంబులు గల్గియుండు నెపుడున్ గోటానకోట్లప్పురిన్. 54
చ. గుఱుతుగ నప్పురిం గలుగు ఘోటకసంఘముతోడ నెంతయున్
బరువిడ నోడి వేగ హరిణంబులు వాయునిశాధినాథ శం

కరులను జేరి హైమైన నధికంబగు వైరము దీర్పలేక యా
కరణిన యుండెఁ దథ్య మిది కాదన వానికి నట్టు లేటికిన్. 55

తే. రాజహంసప్రభలచేత రాత్రి పగలు
కుముదకమలాళి హెచ్చుచుఁ గొమరుఁజూప
రాజహంసప్రతతులచే రమ్యమైన
సరసు లలరారు నచ్చోట సరసు లలర. 56

సీ. అసదృశఫలపల్లవాహారలాలన
శుకపికాదివిహంగశోభితములు
చంచత్ప్రసూననిష్యందమ్మరందాభి
నందితసుందరేందిందిరములు
సతతవిలాససంచారనారీజన
రమణీయగీతవిరాజితములు
సకలశ్రమాపనోదకభూరివిస్తార
మానితచ్ఛాయాసమన్వితములు

తే. వకుళసహకారచంపకాశ్వత్థపూగ
నారికేళకపిత్థజంబీరపనస
కేతకీబిల్వముఖ్యభూజాతయుతము
లున్నతములొప్పునప్పురి యుపవనములు. 57

సీ. లలి బృహస్పతు లందు నలరు విప్రోత్తము
లైనట్టి కల్పకము లందుఁ దరువులెల్లఁ
గామధేనువు లందుఁ గల గోగణములెల్లఁ
బొసఁగ నచ్చర లందుఁ బువ్వుఁబోండ్లు
వలనొప్ప నుచ్చైశ్శ్రవంబు లందు హయంబు
లైరావణము లందు వారణములు
గంధర్వవరు లందు గాయకానీకంబు
లల వైజయంతు లందుల గృహంబు

తే. లభవనామజపంబె యం దమృతసేవ
గాఁగ సురలోకసుఖ మందె కల్గియుండ
రాజసంభారి భళ్ళాణరాయవిభుఁడు
కరుణఁ బాలించు తత్సింధుకటకమువను. 58

సీ. ఆతఁడు స్వప్నంబులందైన నెప్పుడు
పాటిఁ దప్పి యసత్యభాషణములు
చూడఁ డొక్కఁడనైన సురుచిరసౌందర్య
వరవధూజనముఖపద్మములను
వీడఁ డెంతటి యవివేకచిత్తులనైన
శరణు వేఁడినభీతజనవితతుల
నోడఁ డత్యుగ్రరణోర్వీస్థలులనైనఁ
జలితుఁడై శాత్రవసంఘములకు
తే. నతఁడు రాజేంద్రమాత్రుఁ డేమతిఁ దలంప
నర్థిదారిద్ర్యతిమిరార్కుఁ డమితయశుఁడు
భవ్య శివదేవరాయ భూపాలసుతుఁడు
భూరివిభవుండు భళ్ళాణభూధవుండు. 59

తే. ధర్మగుణకాండములె చాలఁ దనకుఁ దోడు
గాఁగ నరులను రక్షించు గణన లేక
ధర్మగుణకాండములె చాలఁ దనకుఁ దోడు
గాఁగ నరులను శిక్షించు గణన లేక. 60

సీ. అలచందురునియందు గలకందుఁ గని ముందు
పలుచందముల నింద లలి నొనర్చి
ఘనలీలలను శూలిగళమూలమున నీల
మును బోలు రుచిజాలమును హసించి

తగ సీరి పై భూరి తరవారి యగుచీరఁ
గని సారెకును గేరి వినుతిమీఱి
పికవాణి యగువాణి పృథువేణి గలవోణి
మిని జాణతనమున మించ పాడి

తే. కుందమందారవిశదారవిందచంద
నేందుమణిహారతారకాహీరవార
ములఁ దిరస్కృతి యొనరించుఁ జలముమిగుల
వరుసతోడుత నమ్మహీవరుని కీర్తి. 61

సీ. కోరినయప్పుడే కురియును వర్షంబు
భూమి ఫలించు నద్భుతముగాఁగ
మొదవులు పాలిచ్చు మూఁడువేళలయందు
విడువక కాచును వృక్షతతులు
నెరి నపమృత్యువు నెఱుఁగ రెవ్వారైనఁ
జోరరుగ్బాధలు సోఁకు టరిది
జలతృణోపేతమై విలసిల్లు ధారుణి
నిత్యోత్సవము లొప్పు నిఖిలదిశల

తే. జనులు కలనైనఁ గలహంబుఁ గనుట లేదు
జాతిభేదంబు దప్పక జరుగుచుండు
జలరుహాప్తాన్వయాంభోధిచంద్రుఁ డగుచు
దనరుభళ్యాణవిభుఁ డేలు ధరణియందు. 62

తే. సతతపుణ్యవ్రతలు గుణోన్నతలు పతికి
హిత లశేషజగజ్జననుతలు భాగ్య
వతులు రూపున మాఱు రతులు సుమతు
లతులసౌజన్యయుత లిర్వు రతనిసతులు. 63

ఆ. వారిలోన నగ్రవనజాక్షి చల్లాంబ
మఱియుఁ బిన్నపొలఁతి మల్లికాంబ
సవతు లెఱును లేక సతతంబు మెలఁగుచు
సవతు లేక యుండ్రు సమ్మదమున. 64

సీ. కమనీయమేఖలాఘటితభూరినితంబ
పోషితాశేషసద్బుధకుటుంబ
సుందరాస్యప్రభానిందితశశిబింబ
మధురోష్ఠవిహాసితమహితబింబ
చికురకోమలకాంతిజితమత్తరోలంబ
కేవలతరకరుణావలంబ
యానావధానప్రవహర్షితకాదంబ
నిఖిలపాపౌఘావనీధ్రశంబ

తే. గురుజనానందకరలసద్గుణకదంబ
సేవకాభీష్టఫలదప్రసిద్ధసాంబ
శివ చరణ భక్తివాసనాంచిత కదంబ
సతత సత్యవ్రతాలంబ చల్లమాంబ. 65

శా. ఆ చల్లాంబవిలాసవైఖరులు భాషాధీశ భోగీశులుఁ
వాచాప్రౌఢిని బల్కఁ జాల రల గీర్వాణాబ్జపత్రాక్షులం
దా చెల్వం బొకయింతయుం గలుగ దిట్లైనట్టి యా లేమతో
భూచక్రంబునఁ గల్గు నిందుముఖులం బోల్పంగ నీ డౌదురే? 66

చ. కలికిపదద్వయంబునకుఁ గ్రక్కున నోడినప్రీడఁ గచ్ఛపా
వళి తలఁ జూపఁ జాలక జవంబున లోఁతగు నీటిలోఁ బెం
దలరఁగ నెట్టితామరలు దట్టపుకాంతికి నోడి తత్పదం
బులఁ బడి యెప్పుడున్ వదలిపోక భజించు సహర్నిశంబులున్,

తే. సకియజంఘాయుగంబుతోఁ బాటిరాఁగఁ
దలఁచి యెదిరించి యోడి డెందమున బలియు
భీతిచేఁ గాదె పొట్టలు పిగులుచుండఁ
గమలగర్భంబు లెల్లనుఁ గ్రిమముతోడ. 68

క. కరిగమనతొడలఁ బోఁడుత
సరిపోలఁ దలంచి చూచి చక్కఁగ నరఁటుల్
పెరిగి జిగితలుగుఁగాకటు
తర మగునే పిల్లపిల్లతరములఁ దమకున్. 69

క. కలికిపిఱుందుల కెనగాఁ
బులినము లిసుమంత లేటులఁ బోలెదు నొకచోఁ
దుల తల యనుచుండెడు వే
దులఁ దుల యన నేల వానితోఁ సరి యగునే. 70

తే. అతివనడకలకు నోడి రాయంచతుటుము
లరయ నిలువెల్ల వెల్లనై యాత్మలోనఁ
దద్విరోధంబు సాధింపఁ దలఁచికాక
కమలజుని మోవఁ దమ కేమి కారణంబు. 71

చ. చిరతరవిక్రమస్ఫురణచే సముదంచితకుంభికుంభముల్
పఱియలు జేసి తత్ప్రళితభక్షణ సేయుమృగేంద్రకోటు లా
గురుకుచసూక్ష్మమధ్యమునకుం దగ నోడి యదృశ్య మయ్యెగా
కరయ గుహాంతరాళముల నట్టు వసింపఁగ నేల వానికిన్. 72

తే. లలనవళులెప్పుడును దారు నిలిచియుండు
నిలకడయొకింతయును లేకచలనమొందు
చుండు నంచును బలుమాఱు నల్లసమున
భంగత యొనర్చు జలధితరంగములకు. 73

చ. పొలఁతుకయారుతీ రలరుఁ బొందుగ నాభి గుహా న్వసించుస
ల్లలితపయోధరద్వయమిళద్ఘన లేపన దివ్యసౌరభం
బలమలయాద్రిశృంగసముదంచితచంచలమందచందనా
నిల మనుచుం బయల్వెడలి నిల్చిననీలభుజంగమో యనన్. 74

చ. చలమునఁ జంద్రుఁ డేఁచఁగను జక్కన లాచెలిగుబ్బచన్నులై
పొలుపుగ నుద్భవించి మదిఁ బూనినసాధ్వస మెల్లఁ దీఱి త
ద్విలసిత నామధేయమున వేమఱుఁ జెల్వగునట్టిచంద్రిస
మ్మిళితములై వసించుఁ జెలినిన్ మనెనో యన నొప్పు నెప్పుడున్

క. విరిచెండ్లు నిమ్మపండ్లును
గర మొప్పగు పసిడిగిండ్లు కరికుంభములున్
సరిగావా వరవర్ణిని
గురుకుచయుగళంబుతోడ గోరంతైనన్. 76

క. గళమునకు నోడి శంఖము
గళగళ మని పలుకుండెఁ గలకంఠంబుల్
పలుచందంబుల నయ్యు
గ్మలిసుస్వరమునకు నోడి మలినములయ్యెన్. 77

సీ. వనజాక్షి కెమ్మోవి కెనఁ బోల్పఁ దగు నని
పల్కదళాల్ గావె పల్లవములు
శుకవాణియధరంబునకు సాటి యౌనంచుఁ
గీర్తింప జాల్గావె కెంపు లెల్ల
నెలనాగ పెదవితోఁ దుర యంచుఁ బొగడంగ
విలువ దేరునుగావె విద్రుమంబు
లింతివాతెఱతోడ నీ డనంగను గంధ
రహితంబు నగు గాదె రక్తకంబు

తే. నరయ నెందులతోఁ బ్రతియనఁగవచ్చుఁ
బలుచనై తేనె లొలుకుచు విలువదెగక

సతతఘనసారసౌరభోన్నతులఁ దనరు
కంబుకంధర రదనాంశుకంబునకును. 78

క. తలతల మనువజ్రంబులఁ
దలతల మను నిందువదనదంతమరీచుల్
కలకల మనియెడు రాచిలు
కలకలమనసుల్ గలంచుఁ గలికిమృదూక్తుల్. 79

ఉ. తామరసాక్షి వీనుగవ తా నవసంఖ్యల నెంచఁజాలుఁ ద
త్కామినితళ్కుఁజెక్కు లలకాముని చేతి మెఱుంగుటద్దముల్
సామజయాననాసికము సంపఁగిమొగ్గల నెగ్గులాడు నా
కోమలిలోచనంబులు చకోరగణంబుల నేలు నెంతయున్. 80

క. వనితారత్నంబునకుం
గనుబొమ లందమున మీఱుఁ గందర్పునిచేఁ
దనరెడి సింగిణివింట్లో
యనుచున్ జనులెల్లఁ జూచి యభినుతి సేయన్. 81

మ. నెరి నబ్జాహ్వయ మిర్వురందు నలర న్నీరేజతారేశు లా
తరుణీరత్నము ముద్దునెమ్మొగముచందం బంద వాదించుచో
సరసీజావళి యోడెఁ గాదని యొరుల్ చర్చింప సర్వోర్వికిం
గర మాహ్లాదము చేయుచంద్రుఁ గసి నుఱిక్కన్ వానికన్నేటికిన్. 82

క. నీలంబుల మృదుతరశై
వాలంబులఁ జారుచమరవాలంబుల స
ద్రోలంబమేచకాంబుద
జాలంబుల నేలఁ జాలు సఖిచికురంబుల్. 83

సీ. జలజాక్షినునుకురుల్ శైవాలలతికలు
రాజాస్యవళులు తరంగతతులు
కలకంఠిలోచనంబులు గండుమీనులు
సుమగంధివిమలహాసములు నురువు

లలితవక్త్రము దక్షిణావర్తశంఖంబు
భామచన్నుబ్బలు పర్వతములు
కామినీమణిజంఘికలు మకరంబులు
చానపిఱుందులు సైకతములు
తే. గంధగజయానచరణముల్ కచ్ఛపములు
రమణిహారంబు లెల్లను రమ్యమణులు
తరుణి ఘననాభి సుడి యనఁ దనరుచుండుఁ
గావున విలాసజలరాశి యావెలంది. 84

వ. ఇవ్విధంబున ననన్యసామాన్యయౌవనసౌందర్యసద్గుణకదంబ యగుచల్లమాంబయు నఖిలగుణంబుల నప్పరమపతివ్రతారత్నంబున కెనయందగు మల్లికాదేవియుం దనకుఁ బ్రియపత్నులుగా నభీష్టభోగంబు లనుభవించుచుండి యారాజపురందరుం డొక్కనాఁ డాత్మగతంబున నిట్లని వితర్కించె నంత. 85

చ. సిరిగలనాఁడె మానవుఁడ శేషజగద్ధితంబు గాఁగ సు
స్థిరతర మైనకీర్తులను జెందుట మే లగు నట్టుగానిచో
సిరియును లేమియుం దలఁపఁ జీకటివెన్నెలవాసిగాక యె
వ్వరికిని లేఁతప్రాయమును వార్ధకముం గురిగాదె మేదినిన్. 86
ఆ. ధనము గల్గియుండ ధర్మంబు సేయక
యున్న నదియుఁ బరుల కొదవుఁగాదె
తేఁటు లెల్లఁగూడి తేనియఁ గూర్చిన
నొరుల కబ్బినట్లు లెఱుఁగుకొనిన, 87
తే. చెలఁగు చౌశీతిలక్షలజీవరాసు
లంచు జనియించి నరకంబు లనుభవించి
యంతమీఁదట మనుజుఁడై యవతరించి
తేఁటపడఁగ సమస్తంబుఁ దెలిసియుండు. 88

ఉ. అట్టిమనుష్యదేహమటు లబ్బినయప్పుడె భక్తిమీఱఁగా
గట్టులరేనియల్లుని జగద్విభు నీశ్వరు నిందుశేఖరుం
గట్టిగఁ బూజసేయుచును గౌతుకలీలలఁ గీర్తికాంతఁ జే
పట్టితుదిం దిరం బయినభవ్యపదంబును జెంద మేలగున్, 89

క. అడిగినవస్తువు లొరులకుఁ
గడువేడుక నొసఁగి ముజ్జగంబులకుం దా
నొడయుఁ డగునట్టిశంభుని
దడయక హర్షింపఁ జేతుఁ దథ్యముమీఱన్. 90

క. ఈవిధమున వ్రతకార్యము
గావింపఁ దలంచుచోటు గావలయుఁ దగ
న్పావనతర గురుదీక్షను
ధీవరులగువారలకు నధికతరభక్తిన్. 91

క. పొసఁగ గురుచరణయుగళము
వెసఁగాంచినయపుడె తొలఁగు వెఱచియఘంబుల్
విసవిసఁ బవనుఁడు జవమున
విసరిన విడి పాఱుజలదవిసరముభంగిన్. 92

మ. వనజాతప్రభవాండమండితజగద్వ్యాకీర్ణుఁడై యొప్పు భ
ర్గుని గాంచన్ గురు నాశ్రయింపవలయుం గుంభాంతరాపూర్ణద
ధ్యసితోద్యన్నవనీత మారయుఁగఁ దథ్యంబొప్ప నెల్లప్పుడున్
ఘనమందారము నాశ్రయించుకరణిన్ గౌతూహలప్రక్రియన్. 93

సీ. బహుజన్మజనితమహాపాపాబ్ధికిని నావ
చర్చింప సద్గురుచరణసేవ
కమనీయపుణ్యలోకప్రాప్తికిని త్రోవ
చర్చింప సద్గురుచరణసేవ

చిరతరైశ్వర్యలక్ష్మీప్రదంబగు త్రోవ
చర్చింప సద్గురుచరణసేవ
దుష్కర్మరుక్సంహతులకు నౌషధసేవ
చర్చింప సద్గురుచరణసేవ

తే. వనజసంభవముఖ్యగీర్వాణబృంద
ములకుఁ గానంగరానిశంభునిపదాబ్జ
దర్శనం బాత్మఁ గోరినధన్యమతుల
కిరవలరుత్రోవ సద్గురుచరణసేవ. 94

క. అని తలంచి యాక్షణంబున
దినకరకులజలధిశీతదీధితి యగున
జ్జనపాలవరుఁడు కౌతుక
మునఁ దనరారుచును వేగమునఁ బయనం బై. 95

సీ. గములు గూడుక కురంగములచందమున వే
గమునఁ బారెడుతురంగములతోడ
నరులకచ్చెరువుగాఁ దరలి యాడెడు పెద్ద
గిరులఁ బోలెడుగంధకరులతోడ
నుతులు సేయఁగ జాలుగతులఁ జెల్వలరారు
నతులశతాంగసంహతులతోడ
గుటిలారివరులఁ గోమటుల జేసెడిమహా
ర్భటులు గల్గినవీరభటులతోడ

తే. హితులతో మాన్యు లగుపురోహితులతోడ
బుధులతోడను వందిమాగధులతోడ
మఱియుఁ దక్కినపరివార మరుదుమీఱఁ
గొలువఁ జనియె నిలాభర్త గురునికడకు. 96

క. అటు లరిగి కనియె నరపతి
పటుశైవకథారహస్యభాసురహృదయున్
ఘటితాఖిలజనకామున్
నిటలాక్షపదాబ్జభక్తినిధి నాచార్యున్. 97

క. కనుఁగొని వినయంబునఁ బద
వనజంబుల కెఱఁగి లేచి వసుధాధిపుఁ డో
య్యన ముకుళితకరతలుఁడై
వినుతింపఁగఁ జూచి గురుఁడు వెసనిట్లనియెన్. 98

మ. క్షితినాథోత్తమ! నీకు నీసతులకున్ సేమంబె? నీమంబుతో
సతతంబుం బ్రజ నేలుచుండుదువె? నీసైన్యంబు లెల్లం బలో
న్నతి నొప్పారుటఁ జేసి శత్రువరులన్ మర్దించి యిష్టార్థముల్
కుతుకం బొప్పఁగ ధారుణీసురులకుం గొంచింప కీఁ జూతువే? 99

క. పరమర్మభేదనుండును
జిరమతిమంతుండు హితుఁడు శిష్టప్రియుఁడున్
వరకులజుండును గరుణా
నిరతుండును నైనమంత్రి నీయెడఁ గలఁడే? 100

క. దేవాధీశ్వరునకు మును
జీవుఁడు దా మంత్రి యగుటచే ఘనుఁ డయ్యెం
గావున విభవముఁ గోరిన
భూవిభునకు మంత్రివరుఁడు భూషణ మరయన్. 101

ఉ. స్నానము సేయునీమమును శంభుపదార్చనఁ జేయుమర్త్యుఁడున్
వానలఁ గల్గుసస్యమును వారిరుహాహితుఁ డుండురాత్రియున్
మానిని గల్గుసౌఖ్యమును మంత్రివరేణ్యుఁడు గల్గ నొప్పున
మ్మానవనాథురాజ్యమును మానుగఁ దేటవహించు నెంతయున్.

వ. అట్లగుటం జేసి నేర్పరి యగుమంత్రి గలరాజు రిపులం

జయించి యక్షీణ రాజ్యసుఖంబు లనుభవించుం గావున సప్తాంగబలం బులకన్నఁ బెద్ద యగుమంత్రాంగబలంబు పరిగ్రహించితివే యని మఱియు భవదాగమనప్రయోజనంబును సవిస్తరంబుగాఁ దెల్పు మనిన నద్ధరావల్లభుం డిట్లనియె.

క. జననుత! మీ రాజ్ఞ యొసం
గినరీతి నొనర్చినాఁడఁ గృతపుణ్య! భవ
ద్ఘనకరుణను నే నిచటికిఁ
జను దెంచుట మీపదాంబుజంబులఁ గొల్వన్. 104

సీ. గురునాథ! జంగంబు గోరిన వస్తువు
నెద్దియైన ముదంబు నివ్వటిల్ల
నొసఁగి జగంబులం దసమానకీర్తులఁ
జెంది గిరీశుఁ డానంద మొందు
నట్లు గావించెద నని తగ నూహించి
వ్రతము గైకొనఁ గోరి వచ్చినాఁడ
మీర లిందుల కిచ్చ మెచ్చి యాదరమున
వీక్షింప నిప్పుడే దీక్ష యొసఁగి

తే. భూతి నెక్కింత నొసటిపై బొట్టు బెట్టి
పాదతీర్థంబు మూర్ధంబుపైనిఁ జల్లి
యాజ్ఞ దయ సేయు మనుటయు నతనిఁ జూచి
యద్భుతంబొంది యాచార్యుఁ డనియె నపుడు 105

ఉ. ఓనరనాథ! భూరిసుగుణోన్నత! నీవిపు డాత్మలోపలం
బూనినకార్య మాపవనభుగ్వరకంకణుఁ డైన నిష్ఠతోఁ
దా నొనరింపఁ జాలఁ డన ధారుణిలో జను లెట్టు నేర్తు ర
ట్లైనప్రయోజనంబునకు నర్హమె నీ కిటు లూహ సేయుటల్. 106

ఉ. ఇప్పటిభక్తిమార్గము నరేశ్వర! చిత్తమునందు నెప్పుడుం
దప్పక నిల్పఁజాలుదువె? తద్విధ మెంతయు దుర్లభంబు నీ
కెప్పుగిదిం బొసంగు! వసుధేశ్వరు లెక్కడ! చెప్పఁ జోద్యమై
యొప్పువ్రతంబు లెక్కడ? మనోభవరూప! యెఱుంగఁబల్కుమా.

క. ఇచ్చెద రనుచోటికిఁ గడు
వచ్చెద రార్యులు చెలంగినారికిఁ గృపతో
నిచ్చల్ గలుగుపదార్థము
లొచ్చెం బించుకయు లేక యొసఁగన్ వలయున్. 108

ఉ. అరయఁగ బుత్త్రినైన సతినైనఁ దనూభవునైనఁ గాంచనా
గారములైనఁ జెల్వ మగుకాయ మొకించుకఁ గోసియైన యా
ధారుణి నైన నిట్టిశపథం బొనరించినచోట నేటుగాఁ
గోరిక యెంతలే దనక గొబ్బున నీవలయున్ బుధాళికిన్. 109

చ. ఘను లరుదెంచి యీఁ దరము గానిపదార్థము లాసతోడఁ గో
రినయెడ నీయఁజాలక ధరిత్రిపయి న్నగుబాటుఁ జెందకం
టెను విను భూవరా! మునుపటింబలె నూరక మేరతో వసిం
చినదియె మేలుసుమ్ము శశిశేఖరు నెమ్మదిఁ బూజసేయుచున్. 110

క. అదియునుగాక యొకయెడ గుఱి
వదలి వెసన్ శిష్యవరుఁడు వ్రతభంగముచేఁ
బొదలినయప్పు డొకించుకఁ
గొదువంటుఁ జుమీ! తలంప గురునాథునకున్. 111

ఉ. నావుడు రాజశేఖరుఁడు నవ్వలరన్ గురుఁ జూచి పల్కె నో
దేవ! భవత్ప్రసాదమున ధీరత మీఱఁగ, దద్వ్రతంబు పృ
థ్వీవరులెల్ల నెన్నఁగను వేడ్క నొనర్చిన సంశయంబు మీ
భావమునందు నిల్పక కృపామతి నానతియీవె శీఘ్రితన్. 112

మ. అరవిందోదరతుల్య పుణ్యయుతకార్యారంభసంరంభవి
స్ఫురితాకీర్ణదృఢాంతరంగ మితరంబుల్ గోరుటల్ నేర్చునే?
చిరగీర్వాణతరంగిణీవిమలవీచీజాలలీలానిరం
తరసంతోషిత రాజహంస మిరవొందం జేసునే వాఁగులన్? 113

వ. అదియునుంగాక. 114

సీ. సతి నమ్మి మును హరిశ్చంద్రభూనాథుండు
సత్యంబు నిలుపఁడే జగమెఱుంగఁ
దనతండ్రియానతిఁ దప్పక హర్షించి
రాజ్యంబు వదలఁడే రాఘవుండు?
శిబిచక్రవర్తి వాసిగఁ దాల్చి డేగకుఁ
గొనకొని దేహంబు గోసియీఁడె?
ఘనత మీఱఁ బరోపకారార్థము దధీచి
తా నస్థు లొసఁగఁడే తనువు విడిచి?

తే. వారలెల్లను బృథ్వినున్నారె యిపుడు?
సలలితం బగుప్రఖ్యాతి వెలసెఁగాక
వినుముగురునాథ! యింక బెక్కులనఁగనెందు
కటులసత్కీర్తినిలిపెద నవనియందు. 115

చ. జలనిధు లింకిరన్ ధరణిఁ జంద్రుఁడు గ్రుంకిన వేధ జంకినన్
జలజలమంచుఁ జుక్కలు కృశింబయి డుల్లిన భూమి కుశ్రింగినం
గులగిరులెల్లఁ బెల్లగిలి కూలిన దిక్కరు లొలి మొగ్గినం
బొలుపుగ నీవ్రతంబు పరిపూర్తి నొనర్తు శివుండు మెచ్చఁగన్.

వ. మహాత్మా! మీయనుగ్రహంబువలన మన్మానసంబు సం
తోషించుచున్నయది మీ రిందులకు సంశయింపక శీఘ్రం బానతీయ
వలయు నని ప్రార్థించిన. 117

తే. అన్నివిధముల నీమది నెన్ని చూచి
గట్టిగా గుఱి నిలుపఁగలట్టులైన

భూమిపాలక! మాచేతిభూతి యొంది
భూతనాథుని మెప్పింపు ఖ్యాతిమీఱ. 118

క. కరుణారసపూరితహృ
త్సరసిజుఁ డైయపుడు గురుఁడు జనపతినొసటన్
సరగున భూతి యొకించుక
తిరముగ నిడి యాజ్ఞ యొసఁగ దినకరకులుఁడున్. 119

క. శరణార్థి యగుచు శిరమున
గురుపదతీర్థంబుఁ జల్లుకొని సద్భక్తిం
బరివర్ణించుచు నొయ్యన
మరలెం బురి కధికసంభ్రమం బలరారన్. 120

ఉ. అంతఁ గొఱంత లేక బల మంతయుఁ జెంత ననంతవాజులన్
దంతుల నెక్కి యెంతయు నితాంతజవంబున నంతకంతకుం
బంతముమీఱ నింతులుగ బంతులుసాగి యొకింత రాఁగ భూ
కాంతుఁడు సొచ్చె నప్పురముకాంతలు సేసలఁ జల్లుచుండఁగన్.

వ. అలికులవేణు లెల్ల మణిహర్మ్యతలంబుల నిల్చి చెల్వుగాఁ
గలువలు నాణిముత్తెములు గాఢముగాఁ బయిఁ జల్ల నప్డు డ
జ్జలజహితాన్వయుం డలరెఁ జూడుతెరంబుగఁ దారకాగణం
బులు బలుదిక్కులం గొలువఁ బొల్పగుచల్లనిచంద్రుఁడో యనన్.

తే. రమణిఁ దళుకొత్త మేదినీరమణునకును
బసిఁడి పళ్ళెరములను దీపముల నుంచి
రమణు లతనుని కంఠహారమణు లనఁగ
నిచ్చు నలరుచు నారతు లిచ్చి రపుడు. 123

తే. ఇందుకాంతావళులభావ మెల్లఁ గఱఁగ
రాజుదయపర్వతమునుఁ జేరంగ నెఱిఁగ
నిందుఁ గాంతావళులభావ మెల్లఁ గరఁగ
రాజుదయపర్వతమును జేరంగ నెఱిఁగ. 124

వ. ఈచందంబునఁ బౌరసుందరీసందోహం బమందం బగు నానం
దంబు డెందంబులం గ్రందుకొన నందంద పయిం దొలఁగించెడు కుం
దాది సుమబృందంబుల గందంబులు పొందుగా హృదయారవిందంబు
నకు విందొనర్ప వందిమాగధులు ముందర సందడిగొని వినుతింప దివ్య
దుందుభినాదంబులు చెలంగఁ గందర్పసుందరుం డగు నవ్వసుంధరాపురం
దరుండు మందహాసం బొదవ నిజమందిరంబుం బ్రవేశించి తన యిందు
ముఖులుం దానును సుఖంబున వసించె నంత. 125

మ. సరసీజోద్భవరుక్మకారకుఁడు ఘనస్త్రీమణిం బ్రేమతోఁ
గర మింపొంద నలంకరించుటకు వేగం గాంచి తా నీటిలోఁ
బరఁగన్ ముంచినయట్టి మేల్మి యగుబల్బంగారపుంబూఁదె య
న్కరణిన్ భానుఁడు బశ్చిమాంబునిధిఁ జక్కం గ్రుంకె నొక్కుమ్మడిన్.

తే. రాజు కువలయ మలరింప రాఁ దలంచు
టెంచి సమయాధికారి గట్టించినట్టి
భవ్యకహ్లారతోరణపంక్తి యనఁగ
సాంధ్యరాగము విలసిల్లె సాంద్రముగను. 127

మ. గురుపత్నిన్ వరియించుద్రోహి తనుఁ గన్గొనరాదటంచున్ సుధా
కరురాకల్ మది నెంచి పద్మిని సునక్షత్రంబుం గడు న్వంచె న
ట్లరయం బుణ్యవధూమణుల్ ధరణి సత్యంతోగ్రదోషాత్మునిన్
సరవిన్ గన్గొన నొల్లకుందురుకదా చర్చింప నెంతేనియున్. 128

సీ. విటులపై మదనుఁడు వెడలుచోఁ
దిక్కులఁ గ్రమ్ముపికాళిసంఘమ్మనంగ
మిగుల నిశాకాంత మేలుసుం
గిడుకొన్న లాలితనీలచేలం బనంగ
బద్మబాంధవునితోఁ బాసి వర్తించు
వాసరలక్ష్మి ఘనదుర్యశం బనంగ

నజుఁడు విష్ణుపదంబు నమరఁ బూజిం
　　చినఁ బరఁగునిందీవరప్రతతి యనఁగ

తే. నవనిఁ దము నెందుఁ జొరనీక దవిలెనంచుఁ
దపనుఁ డపరాబ్ధిఁబడెనింక దాఁగనేల
యనుచు గిరిగుహాలందుండి గొసర వెడలు
కలుషతతి యనఁబర్వె దిక్కులందమంబు. 129

తే. పేర్మిరేఱేఁడు కుముదినిఁ బెండ్లియాడ
రమణఁ బఱతెంచు ననితిమిరమణె చదలు
మంగళంబున వేఁచిన మంగళార్థ
లాజలవరుసఁ దార లల్లనఁ జెలంగె. 130

తే. దృఢతమోభూతబాధితదిగ్వధూటిఁ
బ్రోవఁ దత్కాలఘనయోగి పూన్కిఁ దెచ్చి
నట్టిబల్దివ్వెటీ యన నబ్జవైరి
యురుతర శ్రీలఁ దానంతె నుదయ మయ్యె. 131

సీ. అజుఁడు చకోరామరావనార్థము నిల్ప
　　గోమరారునమృతంపుఁగుండ యనఁగ
బలిరాకకును నిశాసతి హారతిం బట్టు
　　బాగైనరజతంపుఁ బాత్ర యనఁగ
ఘనపాంథహృత్పద్మవనములు గలఁచంగఁ
　　దవిలి యేతెంచుచౌదంతి యనఁగఁ
దొగకన్నె ముద మంది నగుఁగాక
　　యనుచుఁ బ్రాజ్ఞగముచూపెడు దర్పణంబనంగ

తే. విశదకాంతుల నంతంత వృద్ధిపొంది
శీతకరబింబ మింపొందఁ జెలఁగి దిశల
సాంద్రతరముగఁ జంద్రికాసమితి దనరెఁ
గోరికలమీఱి కేరం జకోరకములు. 132

వ. అయ్యెడ. 133

సీ. పట్టైనసిగలపైఁ బట్టుబొందులు జుట్టి
వలిపెగుడ్డలఁ బొంక మలరఁ గట్టి
సొగసుగా నుదుటఁ గస్తూరిరేఖలు దీర్చి
కడఁగి ముత్యాలచౌకట్లు గట్టి
కరములఁ బచ్చలకడియంబు లొగిఁ
దాల్చి కంఠమాలికలు వక్షమున నించి
చలువదుప్పటులు పైవలెవాటు గావించి
కర మొప్పచందనగంధ మలఁది
తే. మల్లెపూదండ లింపు శోభిల్లఁ బూని
పండుటాకులు కపురంపుబాగ లూని
పరఁగఁ జేపట్టి యొయ్యారిభామ లెసఁగ
విటులు విహరింపసాగి రవ్వేళయందు. 134

చ. చెలువగు పెన్నెరుల్ దళుకుఁజెక్కులు నిద్దపుముద్దుమోములుం
గులుకుమిటారిచన్నవలు గొప్పపిఱుందులు వాలుఁజూపులు
న్నిలకిలనవ్వులున్ మిగుల నేటగుగాటపుసూటిమాటలుం
గలిగి విటాళిం దిరముగా వలపింతురు వేశ్య లత్తఱిన్. 135

చ. చిలుకలతేజులున్ జెఱకుసింగిణివిల్లును దేఁటినారియున్
బలుజిగురాకువాలును వనప్రియసైన్యము పువ్వుదూపులున్
జెలఁగెడుమీనుటెక్కమును జెన్నొదవ న్వడలెన్ విటాళిపై
మలయమరుద్వసంతఘనమంత్రులఁ గూడి రతీశుఁ డయ్యెడన్. 136

క. పుండ్రేక్షుచాపమునఁ గడు
వేంద్రపుఁబువుటమ్ముఁ దొడిగి విరహిజనులఁ జె
క్కుండ్ర నపుడేసె మన్మథుఁ
డెండ్రాయని యొరుఁడు దన్ను నెదురుట లేమిన్

చ. బలములఁ బోఁజుదీర్చి నిజబాణపరంపర లెల్ల నేర్చి దో
ర్బల మరుదాలఁ జేర్చి కడుబాగుగ సింగిణిఁ జేర్చి లీలతోఁ
బలుమఱు నేసి యార్చి వరబంభరవేణులఁ దార్చి నాథులం
గలయఁగఁ గూర్చి నోర్చి యలకాయజు వైఖరి నేర్తురే యొరుల్. 137

ఉ. కొమ్మ లనంగ నొప్పుపుప్పొఁ గొమ్మలఁ జేరి వినూత్నదివ్యగం
ధమ్ములఁ గేరి మోవి నమితమ్ముగు తేనియఁ గ్రోలి సోలి యా
ముమ్మరమైన కోడిచనుమొగ్గలమీఁదను వ్రాలి చాల సౌ
ఖ్యమ్ములఁ దేలె లీలఁ బురుషావళి యట్ల మధుపంబు లయ్యెడన్.

ఆ. అంతఁ గడఁక నంతకాంతకుఁ డంగజు
డరయఁ దనదుభక్తపరునిపురము
జనుల నేఁచు టెఱిఁగి సరగ వే జూచుకై
వడిని వేగుఁజుక్క వొడిచె దివిని. 139

లయగ్రాహి. 140

కుక్కుటము లెంతయును బెక్కు లగుదిక్కులను నిక్కి మద
మెక్కి భువిపిక్కటిల మ్రోసెన్, జుక్కలును సోముఁడును గ్ర
క్కునఁదొలంగి రలజక్కవలు గేరుమరుఁడుక్కుచెడి పాఱెన్,
జక్కఁగ విహంగములు జిక్కునడియున్న తమఱెక్క లలరించు
కొని చొక్కముగఁ బల్కెన్, గ్రిక్కిఱిసి తేఁటిగము లక్కమల
రాజిపయిఁ బొక్కుచుఁ జరించెఁ దొగ లొక్కట మునింగెన్.

చ. అతులతరార్చు లెల్ల నలరారఁగ నెంతయుఁ గ్రోధచిత్తుఁడై
నతజనఘోరకిల్బిషవనంబులఁ గాల్పఁగ నాత్మ నెంచి శ్రీ
శ్రుత నరుదెంచినట్టి యలగంధవహాప్తుఁడో యవ్విధంబునన్
ధృతి నుదయించె జంభరిపుదిగ్గిరిపై హరిదశ్వుఁ డంతటన్. 142

క. పురజనము లపుడు కడున
బ్బురపుంగోరికల నంతిపురములతోఁ గ

ప్పురపుర్ధూమము లిడి గో
పురములపైఁ గనకకుంభములు నిల్పి తగన్. 143

సీ. తీరుగా నాణిముత్తియపుఁబందిరు లిడి
కలువలు నించి మేల్కట్లు గట్టి
గోడల నెల్ల రంగుగఁ జిత్తరువు వ్రాసి
వేదులు దేవతావేశ్మములును
వింతగా నలరించి వృషభకేతనముల
గీములయందెల్లఁ బ్రేమనునిచి
వీథులు జక్కఁగావించి చందనమునుఁ
గస్తూరియునుగూడఁ గలిపి చల్లి

తే. యఖిలజనములు పురినెల్ల నమరఁజేసి
రప్పటికిమున్నె యొప్పులకుప్పలయిన
తనవధూరత్నములుఁ దాను ధరణివిభుఁడు
వేగ మేల్కాంచి తత్కాలవిధులఁదీర్చి. 144

ఉ. తానము లాడి నీసుమున ధౌతపటంబులు గట్టి యంత సం
స్థానమునందు భర్మమణిసంఘటితం బగు వేదిమీఁదటన్
భానుకులాగ్రగణ్యుఁ డగుపార్థివశేఖరుఁ డాత్మలోన నిం
పూనిన వేడ్కతోడ శివపూజ యొనర్పఁగ సాగె నుబ్బుచున్. 145

సీ. ఆవాహనంబు వృషాధిపవాహున
కాసనం బమలసింహాసనునకు
నర్ఘ్యం బనేకలోకాధారమూర్తికిఁ
బాద్యంబు సుగుణసంపాద్యునకును
నిజభక్తి నాచమనీయ మీశ్వరునకు
స్నానంబు వేడ్కతో స్థాణునకును
వస్త్రం బశేషగీర్వాణసన్నుతునకు
బ్రహ్మసూత్రము పరబ్రహ్మమునకు

తే. గంధ మిభదైత్యదాన నిర్గంధునకును
బుష్ప మక్రాంతమునిజనపోషణునకు
ధూప మానస్యకాంతి విధూపమునకు
దీప ముష్ణాంశుకోటి ప్రదీపునకును. 146

శా. నైవేద్యంబు బహిరాజకంకణునకుం దాంబూల మేపారఁ ద
ద్దేవేంద్రార్చితపాదపంకజునకున్ ధియుక్తి నీరాజనం
బావేదాత్మునకున్ సుమాంజలి రతీంద్రారాతికిన్ విస్ఫుర
ద్గ్రావస్థానునకుం బ్రదక్షిణనమస్కారంబు లర్పించుచున్. 147

సీ. మందారకుందారవిందనీలోత్పల
బంధూకవకుళసౌగంధికములఁ
బ్రియమొప్పఁ దులసికాబిల్వాదిమృదులత
గోల్లసద్బహువిధపల్లవముల
ఘనసారచందనాగురుచారుగుగ్గులు
కస్తూరికాదికవస్తువులను
దధిఘృతగోక్షీరమధురసనారికే
ళాంబువు లనెడుపంచామృతములఁ

తే. బొలుపు మీఱెడుకాంచనపుష్పములను
నాగవల్లీదళక్రముకభాగములను
సలలితాపూపసూపాన్నఫలతతులను
జనవరుఁ డొనర్చె నవ్వేళ శంభుపూజ. 148

వ. మఱియు గీత వాద్య నృత్తాది బహువిధానందంబుల నంబికారమణు నారాధించి యిట్లని వినుతింపం దొడంగె. 149

సీ. కలధౌతనగవాస! కరిచర్మమృదువాస!
శరదిందునిభహాస! శరణుశరణు!

ఇనకోటిఘనదీప ! కనకాద్రిపటుచాప !
సనకాదినుతరూప ! శరణుశరణు !
వరయోగిజనలోల ! దురితాభ్రవాతూల !
సురరాజవరపాల ! శరణు
రణరంగరిపుభంగ ! రమణీయధవళాంగ !
చతురాగమతురంగ ! శరణుశరణు

తే. సతిలతాంభోధితూణీర ! శరణుశరణు !
శాశ్వతైశ్వర్యసంయుక్త ! శరణుశరణు !
సాధులోకసురోర్వీజ ! శరణుశరణు !
శరణు! విశ్వేశ! భూతేశ! శరణుశరణు ! 150

సీ. పొంకంబు గలమంచిజింక నంకంబుగాఁ
గొంకక ప్రేమతోఁ జంక నిఱికి
దిట్టతనంబుతో గట్టిగా సామేన
గట్టులదొరముద్దుపట్టి నునిచి
వింతఁగా సికను బూబంతిగా జాబిల్లి
నెంతయుసంతసం బెసఁగ నిలిపి
మేలైనయేనికతోలు శాలుగఁ బూని
లీలతో ముమ్మొనవాలుఁ దాల్చి

తే. పొసఁగ భసితంబుఁ బూసి యాఁబోతునెక్కి
గాలిమేఁపరిసొమ్ములఁ గడఁధరించి
లచ్చిమగఁడును నలువయు మెచ్చిపొగడ
జగము లేలెడు నినుఁగొల్తు నిగమవినుత. 151

శా. నీతేజోద్భవముఖ్యులౌ సురమునుల్ నిత్యస్తుతుల్ సేయఁగా.
దా రొక్కింతయు నేర రంచును బుధుల్ తథ్యంబుగాఁ బల్కఁ—చో

నోరాజార్ధకిరీట! మర్త్యుఁ డిఁక నెట్లోపుర్ ప్రశంసింపఁగా
గౌరీమానసపద్మమత్సరణ! శ్రీకంఠా! జగద్రక్షకా. 152

తే. శివశివా యని సన్నుతి సేయనేర
వినయ మొప్పారఁ బూజఁ గావింపనేర
మూఢుఁడను నన్నుఁ గృపఁజూడు ముదముతోడఁ
బార్వతీలోల సంతతభక్తపాల. 153

క. జయజయ పురదైత్యాంతక!
జయజయశృంగారలీల! సదమలశీలా!
జయజయ నాకాధిపనుత!
జయజయ లోకాధినాథ! జయ పరమేశా! 154

వ. ఇట్లనేకప్రకారంబులఁ బ్రస్తుతించి తదనంతరంబ. 155

క. తరుణారుణాంశునిభ భా
సురనవరత్నచయఖచితశోభితదివ్యా
భరణోజ్జ్వలాంగుఁ డయి య
త్యురుతరచిత్రాంబరముల నొగి ధరియించెన్. 156

తే. అరయ రుద్రాక్షమాలిక లలుఁగ మెరయ
ఫాలమున భూతిరేఖయు శ్రీలదనరఁ
బసిఁడిపావలు దొడిగి వైభవముచెలఁగఁ
గ్రపువిడెంబు సేయుచుఁ గౌతుకమున. 157

సీ దివి పిక్కటిలఁ బెక్కు తెలుఁగుల నెడలేక
భేరీమృదంగముల్ భోరుచెలఁగఁ
గంతునిచేతి చేమంతిబంతు లనంగ
వంతుకెక్కిన కళావంతు లాడఁ
దుంబురునారదాదులఁ దిరస్కృతి సేయు
గాయకుల్ గీతకుల్ కడఁగి పాడ

వాదిమాగధులు చెల్వొంది ప్రస్తుతిసేయఁ
జేరి భూదేవు లాశీర్వదింప
తే. రమణఁ బరిచారికలు ముందఱను బిలుందఁ
బసిఁడిబెత్తులచేఁ బరాబరు లొనర్ప
రాజసంబున నంతఃపురంబు వెడలి
ఘనత నుర్వీశుఁ డాస్థానమునకుఁ జనియె. 158

సీ. చాలుచాలునఁ జాలునీలంపుఁబగడంపుఁ
గంబము ల్మితి లేనికాంతిఁ దనర
గారుత్మతపుమణు ల్గదియించినట్టిమే
ల్మేడగోడలు సొంపుమీఱి యలర
నిండుకాంతిములఁ బొల్పొంద నొనర్చిన
సోపానములు వింతశోభ లెసఁగ
వెలలేనివజ్రంపువేదిక ల్చెలువాఱ
గోమేధికపుగవాక్షులు చెలంగ
తే. నతులవైడూర్యపుష్యరాగాదినీల
రత్నవస్తువు లెంతయు రమణ మెఱయఁ
గ్రొత్తముత్తెంపుబెత్తులు గోమలుమిగులు
కొలువుకూటంబునందునఁ గూర్మితోడ. 159

క. కురు మగధ చోళ మాధవ
కరహాట మరాట లాట కర్ణాటక ఘూ
ర్జర యావనముఖ్యధరణీ
వరు లెల్లఁ గొలువ భూరివైభవలీలన్. 160

సీ. వేదశాస్త్రపురాణవివిధరహస్యము
ల్వరుసతోఁ గవిబుధావళులు దెలుప

సంగీతనృత్తాదిసరసవిద్యాప్రౌఢి
కడువేడ్కఁ నర్థిసంఘములు నెఱప
శైవ వైష్ణవ జైన చార్వాక బౌద్ధ శా
క్తేయులు తన్మతక్రియలు సెప్ప
కరవాలశూలతోమరభిండివాలాది
శస్త్రపాతకులు ప్రశస్తిఁ జూప
తే. రమణు లిరుగడ వింజామరములు వీవఁ
గడఁగి డెబ్బదిరెండగు ఘననియోగ
ములఁ దవిలి రత్నపీఠాగ్రమునఁ జెలువుగఁ
గొలువుఁ గూర్చుండె మేదినీతలవిభుండు. 161
క. అతులితవిభవంబున నీ
గతిఁ గొలువున నుండి యచటఁ గల జనములకుం
గుతుకం బొప్పఁగ ధరణీ
పతి దా నపు డిట్టు లనుచుఁ బలికెం బ్రేమన్. 162
చ. వినుఁ డిదె యాదిగాఁగఁ బృథివిం గలజంగమకోట్లకెల్లనుం
గొనకొని సత్పదార్థములఁ గోరినయంతనె పూన్కితోడ లే
దనక రయంబుమీఱ ననయంబును నిత్తు నృపాధిరాజవా
హనునకుఁ బ్రీతిగాఁగ జగమంతయు మెచ్చఁగ నుత్సవంబునన్. 163
ఆ. ప్రజలకెల్లఁ దెలియఁ బ్రతిన గావించెద
నడుగకున్నవారి కరయ నొట్టుఁ
జేరి యాసతోడఁ గోరినవారల
కీయలేనివాని కిదియ యొట్టు. 164
క. అని పలికి సకలదిశలం
బనివడి చాటింపఁ బనిచి బాగుగ మొగసా
లను గంట ప్రేలఁ గట్టిం
చెను జనములకెల్లఁ గడువిచిత్రము మీఱన్. 165

వ. ఇట్లు శపథంబు గావించి దిశలంజాటించినఁ దద్వృత్తాంతం
బంతయు విని క్రమంబున. 166

సీ. కక్షపాలలు పైఁడికట్లబెత్తంబులు
శంఖసంఖ్యల మించుశంఖములును
పిడిగంటలును గేకిపింఛంపుఁగుంచెలు
ఛత్రముల్ బులితోళ్ళు చామరములు
యోగదండంబులు యోగపట్టెడలును
గండపెండేరము లుక్కుండలములు
తనువులభూతిపూఁతలు కావివస్త్రము
లమైనరుద్రాక్షమాలికలును
తే. శ్వేతకేతనములు రుద్రవీణియలును
బాత్ర మగునట్టిరజతంపుఁ బాత్రికలును
గేలుఁదామరఁ బలుపైనశూలములును
మొలకబంగరుగిలుకుపావలును గలిగి. 167

సీ. అతులిత విమల పంచాక్షరీ మంత్రంబు
మించి కోరికఁ బఠియించువారు
తెలుచుగా శైవకథారహస్యార్థము
ల్నెఱి శిష్యవరుల కేర్పఱచువారు
సారెసారెకు "నమ శ్శర్వాయ రుద్రాయ
పశుపతయే" యని పల్కువారు
నడుగడ్డునకుఁ గాహళాదిరవంబులు
చెలఁగించుచును వేడ్క నలరువారు
తే. చిత్రగతులను గానంబుఁ జేయువారు
సరవితో గద్యపద్యము ల్చదువువారు

నగుచుఁ గోటానకోట్లలోకము లొగిని నడువ
సాగి రానేల యీనినచందమునను. 16

సీ. మల్లయ్య వీరయ్య మఱి విరూపాక్షయ్య
జడముడిబసవయ్య శంకరయ్య
పిడిఘంటచిక్కయ్య భీమయ్య సోమయ్య 8
శివ్వయ్య హరిణాంకశేఖరయ్య
మరులయ్య సంగయ్య మార్కండలింగయ్య
పర్వతనాథయ్య పశుపతయ్య
శరభయ్య రుద్రయ్య కరపాత్రసిద్ధయ్య
శితికంఠయోగయ్య శ్రీగిరయ్య

తే. విశ్వనాథయ్య వీరమాహేశ్వరయ్య
యాదిగాఁ బేరు గల్గి మహాత్ము లయిన
జంగమస్వాము లారాజసముఖమునకు
సరగఁ జనుదెంచి రత్యంతసంభ్రమమున. 169

వ. ఇవ్విధంబునఁ బఱతెంచి నృపాలుం గాంచి. 170

శా. ఏరా! భూవర! మాకుఁ గాంచనతురంగేభాంబరాందోళికా
భూరిస్యందనమందిరోపవనసద్భూషామణిశ్రేణులున్
జేరెం గావునఁ బల్లెలుఁ బశువులుఁ లెక్కింప కర్థంబు మా
కీరా! కోరిక దీఱ మీఱ కిఁక నీ వెంతేనియుఁ ధీరతన్. 171

క. పాలు పెరుఁ గిక్షురసమును
జాల ఫలరసములు దేనె శర్కర ఘృతముఁ
మే లగుకజ్జంబులు నీ
వేళకుఁ దెప్పించరోరి వేగమె మాకున్. 172

మ. అనుచుం గోరిన జంగమయ్యలకు నత్యానందచేతస్కుఁడై
మనుజాధీశ్వరుఁ డర్ఘ్యపాద్యవిధులన్ మన్నించుచుం గాంచనా

సనము ల్వెట్టి బహుప్రకారములఁ బూజ ల్సేసి యశ్రాంతమున్
ధనధాన్యాంబరముఖ్యవస్తువులచేత స్ప్రీతి గావించుచున్. 173

క. అడిగినవస్తు వొకింతయుఁ
దడయక యాక్షణమునందె తాత్పర్యముతోఁ
గడువడి నొసఁగుచు భూపతి
పుడమిన్ బ్రతివాసరంబు బ్రోది యొనర్పన్. 174

క. జంగంబు లెల్ల నచట భు
జంగమరాజాంగదుని వెసం గొల్చుచు నో
జం గములై వసియించిరి
బంగరపుమఠంబులందు భాసురలీలన్. 175

వ. ఈక్రమంబున నద్ధరాధీశుం డతులిత ధర్మమార్గప్రచారుండై ప్రతిదినజంగమారాధన సేయుచుండెనని సూతుం డెఱింగించిన నైమిశారణ్య మహామునులట మీఁది కథా వృత్తాంతం బెట్లని యడుగుట యును. 176

ఉ. హారతుషారహీరశరదభ్రనిశాకరతారకాబ్జడిం
డీరమరాళపారదపటీరవియత్తటినీసితాభ్రమ
దారసురేంద్ర నాగకలధౌతసుధారససన్నిభోజ్జ్వలా
కార లసద్విహార సుమకాండవిదార! యుదార! శంకరా! 177

స్రగ్విణి.
చారుకారుణ్యవిస్తార! తారేశ కో
టీర! దైత్యేభకంఠీరవేంద్రాదిబృం
దారకానీకమందార! సత్యవ్రతా
చార! గోరాజసంచార! గౌరీశ్వరా! 178

తురగవల్గనము.

ధరణిధరవరశరణ చిరశుభదాయకా హరిసాయకా
తరణిశశిశుచినయన దురితవిదారణా! లయకారణా!
పరమపురుష హరిహయనుత! పురభంజనా! మునిరంజనా!
హర! గరళగళ! విమతదనుజభయంకరా! జయ శంకరా! 179

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాద లబ్ధ కవితా సామ్రాజ్య ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయ నామధేయ ప్రణీతం బైన రాజశేఖర విలాసం బను కావ్యంబునందు ప్రథమాశ్వాసము.

# రాజశేఖరవిలాసము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీ రాజితాఖిలాగమ
పారగ! సురరాజమౌళిభాసురతరకో
టీరా! మణిరుచిరచరణా!
క్రూరాహితమదవిభంగ కుక్కుటలింగా!

వ. అవధరింపుము నైమిశారణ్యమహర్షులకు నిఖిలపురాణవ్యాఖ్యాన విఖ్యాతుం డగు సూతుం డిట్లనియె. అట్లు నిరంతరజంగమారాధనదీక్షితుండై యాక్షమావల్లభుండు వర్తించుచున్నసమయమున నొక్క నాఁడు.

సీ. ఘన మైనతనుకాంతిఁ గనుఁగొన్నచో శర
ద్ఘన మైనఁ దాఁకకే కదలి పాఱఁ
బొడ వైనజడలదీప్తులు సాంద్రతరబాల
జలజాప్తరుచులతోఁ జెలిమిసేయ
నిండుచందురుఁ బోలునిటలభాగంబున
రమ్యభస్మత్రిపుండ్రంబు మెఱయఁ
బవమానవశమునఁ బల్కు చేతివిపంచి
గళరవంబునకు రాగంబు గూర్ప

గీ. మండితం బైనదండకమండలువును
నలరుపటికంపుసరులు మృగాజినంబు
గల్గి యరుదెంచె సమ్మహీకాంతుకడకు
భూరిలీలాప్రచారుండు నారదుండు. 3

ఉ. వచ్చు టెఱింగి మౌనిజనవర్యు నెదుర్కొన నేఁగి మ్రొక్కి తోఁ
డ్తెచ్చి యనర్ఘ్యరత్నరుచిదీపితపీఠమునందు నుంచి తా
హెచ్చుగ నర్ఘ్యపాద్యవిధు లిచ్చి కడు న్వినుతించి భక్తితో
నచ్చతురాస్యసూతికి ధరాధిపుఁ డిట్లని పల్కె నేర్పునన్. 4

ఉ. బొంకులకెల్లఁ దానకము పుట్టినయి ల్లగుఁ గల్మషాళికిం
గొంకక సర్వదుర్గతులకుం దగుమూలము రాజసంబు నీ
వింక నతిప్రయాసమున నిట్లగు రాజసవృత్తి నుండియు
న్బింకముతో వ్రతంబున కపేక్ష యొనర్తురె పార్థివోత్తమా! 27

గీ. నీకు నీవేళ నొకకాసు లేకయున్న
నిదిగొ మాచేతికాసైన నిచ్చి వేగ
వెలపొలంతినిఁ దెప్పింపు మలర నిదియు
వినఁగఁగాదేని శపథంబు విడువుమిపుడు. 28

ఉ. వాహనము ల్రథంబులును వారణము ల్మదవు ల్ధనంబులున్
గేహములు న్బురంబులను గేవలరత్నవిభూషణంబులున్
సాహసవృత్తితో నొసఁగి చాలఁ బ్రియంబునఁ గూర్చి యిప్పు డు
ద్వాహము సేయుకంటె నొకవారవధూటి నొసంగరాదొకో? 29

చ. అనుడు దినేశవంశకలశాంబుధిచంద్రుఁడు యోగిచంద్రునిం
గనుఁగొని యో మహాత్మ! తగుకార్య మెఱింగినరీతి విన్నవిం
చినపనిగాని లోభమునుఁ జెంది వచించుట గాదు మీఱ లిం
దున కలుగంగఁ బాడియె? బుధుల్ క్షమ సేయరె తప్పు గల్గినన్. 30

క. కావున మీమది కింపుగ
వేవేగ వలంతి యొకవేడుకకత్తెన్
రావించెదఁ గైకొను మో
భావజనిభ! యనిన నతఁడు ప్రమదముతోడన్. 31

క. అటులేని దెలియవిను మొ
క్కటి భూతలనాథ! వారకాంతవిధము ప్ర
స్ఫుటగతిఁ జెప్పెద జంగమ
విటుఁ డని యెన్నక కను న్వివేకము మెఱయన్. 32

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రబింబద్యుతిఁ
బెద్దయు నిరసించుముద్దుమోము

విరిదమ్మిరేకుల నెఱిఁ బరిహాసంబుఁ
గావించునిడువాలుఁగన్నుదోయి
బింబికాఫలకాంతిఁ బేర్మిమీఱి జయింపఁ
దివిరెడు సొబగైన తియ్యమోవి
మేలిబంగరుబొంగరాలలీలల నేలఁ
జాలినకఠినంపుఁ జన్నుఁగవయుఁ

తే. గొదమతుమ్మెదకదుపుల గదుముకురులు
కరికరంబుల కెన యనఁ బరఁగుతొడలు
గొప్పపిఱుఁదులు నల్పమై యొప్పుకౌను
పృథ్వినాథ! గభీరనాభియును గల్గి. 33

తరళ. మొలకనవ్వులు వాలుఁజూపులు ముద్దుగుల్కెడుపల్కులుం
దళుకుఁజెక్కులు హంసయానము తమ్మితూండ్ల జయింపఁగా
గలభుజంబులు కంబుసన్నిభకంధరంబును గల్గి తా
వలచియు న్వలపింపనేర్చినవామలోచన కావలెన్. 34

క. పురుషుం డలసినమీఁదటఁ
బురుషాయితబంధగతులఁ బొదువుచు వరుసన్
సురతంబు సేయ నేర్చిన
గురుకుచ గావలయు నలరఁ గువలయనాథా! 35

క. నఖదంతక్షతచుంబన
ముఖనిఖిలరతిప్రకారములఁ దానె కడున్
సుఖలీలఁ గలయునీరజ
ముఖి నే కావలయుఁ జుమ్ము భూపతితిలకా! 36

చ. కలకల నవ్వుకొంచుఁ దమకంబునఁ గంచెల పిక్కటిల్లఁగాఁ
గులుకుమిటారిగబ్బిచనుగుబ్బలు పైపయి నుబ్బఁ దేనియ
ల్చిలికెడుముద్దుపల్కులును జెన్నుగ మోహముమీఱఁ గేరున
చ్చిలుకలకొల్కి గావలయుఁ జిత్తజకేళికి భూభుజోత్తమా. 37

సీ. నిక్కుజక్కవదోయి నెక్కసక్కెములాడు
చనుగుబ్బ లురమున నొనగ వాని
భుజయుగం బలర మూఁపున లీలఁ గీలించి
చెలువొప్పఁ జెక్కునఁ జెక్కుఁ జేర్చి
పలుమాఱు గళరవంబులు మీఱి చెలఁగంగ
నిమ్ముగా మరునిల్లు చెమ్మగిలఁగ
కొనగోటిపోటు లొయ్యన మర్మము ల్నాట
వగలచే బెదురుమై వడఁకు దోఁపఁ
తే. జొక్కి బిగికౌఁగిలింతలఁ జెక్కుక్రియలఁ
బ్రేమదళుకొత్త వసియించి పినపనుపరి
సురతమును బ్రౌఢయై సేయుసుందరాంగి
కావలయుఁజుమ్మ ధారుణీకాంత! యిపుడు. 38

వ. మఱియును 39

సీ. ధనగర్వమునఁ బల్లవునిఁ దృణీకృతలీల
గణనసేయసి పెల్లుకత్తె గాక
కలహించి వేడుకకాని నెంతయు నెగ్గు
లాడుచు నుండుగయ్యాళి గాక
నెమ్మది యొరునిపై నిలిపి మారుని కేళి
నలరఁ దేలింపనితులువ గాక
ప్రేమచేఁ బిలిచిన బేలయట్టులఁ బల్క
నొల్లనిమాయలబల్లి గాక
తే. యొకనిచే విత్త మంది వేఱొకనిఁ గోడఁ
గలిసి వర్తించుబద్దొసకారి గాక
పూని యెప్రొద్దునిద్దురపోతుగాక
మదటయును గాక పరికింప మలిన గాక. 40

తే. విటునితోఁ గూడియున్నట్టివెలఁదిఁ జాళ,
బానిసెయు రోగియును గాక పాపి గాక
చేలయును గాక తగ మగవాలు గాక,
యున్నవాల్గంటిఁ దెప్పింపు ముర్వినాథ! 41

క. విను చిత్తిని శంఖిని హ
స్తిని పద్మిని యనెడునాల్గు తెఱఁగులసతులం
దునఁ బేరెన్నికయగుప
ద్మిని గావలె జుమ్ము మాకు మిహిరకులేశా. 42

క. శివపాదభక్తినిరతయు,
నవిరళసౌందర్యవతియు సతిపుణ్యగుణ
ప్రవిమలతరహృత్కమలయు
నవనీశ్వర! మాకు నిచ్చునది యిపు డెలమిన్, 43

సీ. ఘనసారమృగమదగంధసారానేక
సంతతనవ్యవాసనల చేత
మౌక్తికాంబుజరాగమరకతనీలాది
దివ్యమాణిక్యదీధితుల చేత
దరుణేందుబింబసుందరదర్పణావళి
తరళితఘనధగద్ధగల చేత
సౌవర్ణపర్యంకసంవ్యాప్తమల్లికా
ద్యతులితకుసుమసంహతుల చేత

తే. సరవిఁ దెఱయిడ్డచందువాసిరుల చేత
బ్రికటితము లగుజాలవల్లికల చేత
సారదిఁ బేరైననిఖిలవస్తువుల చేత
నలరు కేళీగృహంబు గావలయుఁ జుమ్ము. 44

వ. అనిన నృపాలుం డిట్లనియె.

తే. అట్లు కానిమ్ము దేవ మీ రానతిచ్చు
క్రమము మీఱంగ నిప్పుడే గడనసతిని
నలరఁ దెప్పింతుననిపల్కి యాక్షణంబ
కౌతుకంబాత్మ నెంతయుఁగడలుకొనఁగ.

క. తలవరులఁ బిలిచి ధరణీ
తలవరుఁ డవ్విధముఁ జెప్పి తగినధనంబుల్
వలనొప్పఁగ నిచ్చి ముదం
బలరఁగ వెలపొలఁతిఁ దెం డటంచుం బలికెన్. 47

వ. అంత

ఉ. పద్మము లెంతయు న్బాసఁగు బాసి వెస న్ముకుళింప విస్ఫుర
త్పద్మములందు భూసురులు తత్సమయక్రియ లాచరింపఁగా
సద్మము మీఱువార లగుసామజయానల కెల్లఁ జాలహృ
త్పద్మము లుల్లసిల్ల రవి పశ్చిమవారిధిఁ గ్రుంకె న త్తఱిన్. 49

సీ. కర మొప్ప సాంధ్యరాగము మీఱెఁ జెలువారు
నంధకారము పర్వె నఖిలదిశలఁ
జుక్క లాకసమునఁ జక్క నొక్కటకుండె
ముదముతోఁ దొగల ఱేఁ డుదయమయ్యె
జనులకెల్లను బ్రీతి యొనర వెన్నెల యొప్పె
లలిఁ జకోరములు కోర్కెలఁ జెలంగె
నలిని తాఁ దలవంచె నగియెను గుముదిని
కోకంబు లెడబాసి కుందె మదిని

తే. మరుఁడు వెడవింటవిరితూఁపులరయ బూని
యేపుదనరారవిరహుల నేయఁదొడఁగె
సతులకుఁ బురుషులకుఁ బరస్పరవిలాస
రసము చిలికెడుపలుకు లింపెసఁగ నవుడు.

సీ. ముత్యాలతాటంకములు గొమ్ము పూఁబోఁడి!
బన్నసరం బిదే సన్నుతాంగి!
భుజకీర్తు లివె చూడు గజరాజగామిని!
యొడ్డాణ మిదిగొ మహోత్పలాక్షి!
కరకంకణంబులు గైకొమ్ము హరిమధ్య!
చేర్పుక్కబొట్టిదె చిన్నెలాఁడి!
మొగపులతీఁగ చెల్వుగఁ బూను శుకవాణి?
నేవళం బిదె రమ్ము నీలవేణి!
తే. రత్నహారంబు లివె యుడురాజవదన!
వన్నెచీరలు గొనుము సౌవర్ణవర్ణ
గంధసారంబుఁ బూయు మోకంబుకంఠి
యనుచుఁ దుద లేనికోరిక లాత్మ నలర.

ఉ. పల్లవులెల్ల మొల్లముగ బల్లిదులై కడు మంచివస్తువు
లొక్కల్లలుమీఱఁ బట్టుకొని కూరిమితోఁ బఱతెంచి వారసం
ఫుల్లసరోజనేత్రలకుఁ బొందలరార నొసంగి వేడ్కఁ రం
జిల్లఁగఁ బెక్కుమక్కువలఁ జెంది సుఖింతు రనేకలీలలన్. 52

క. తలవరు లయ్యెడ నర్థము
లలఘుగతిం గొనుచు సరగ నంచితకౌతూ
హలమానసు లగుచు న్వే
శ్యలగృహముల కరిగి పిలువసాగిరి వరుసన్. 53

సీ. రమ్ము పద్మావతీ! రావె చింతామణీ!
రా జగన్మోహినీ! రాజరేఖ!
రమ్ము చకోరాక్షి! రా పుష్పమంజరీ!
రావె లీలావతీ! రత్నపుత్త్రి!
రా సుందరాకార! రమ్ము కైరవగంధి!
రావె బింబాధరి! రమ్యభూమ!

రావె కోకిలవాణి ! రా సరోరుహపాణి !
రా మధువ్రతవేణి! రమ్ము తరుణి!
తే. రావె నారీశిరోమణి! రమ్ము రమణి!
రమ్ము నవచంద్రికాహాస! రాజహంస!
యనుచు వేవేగ నింటింటి కరిగి యిటులఁ
దలవరులు వారకాంతల నలరఁ బిలిచి. 54

క. ధనములు మణిభూషణములు
ఘనతరచిత్రాంబరములు గలపంబులునుం
గొనుఁ డివె విటజంగమునకుఁ
బనివడి నిద్దురకు నివుడు ప్రమదము మీఱన్.

తే. వనజముఖులార! ధారుణీవరునియాజ్ఞ
యిట్లు కావున మసలక యీక్షణంబ
వలసినంతధనంబును వరుసఁ గొనుచు
వేగముగ రండు జంగమవిటునికడకు. 56

వ. అని పల్కుటయును. 57

సీ. నెఱజాణఁ డొకఁ డింట నిద్దుర చున్నాఁడు
రాఁ గూడ దనె నొక్క రాజవదన
కోడెకాఁ డొకఁడు దాఁ గోరినధన మిచ్చి
వదలనీఁ డనె నొక్క వాలుఁగంటి
మిగులఁ గూరిమి చేయువగకాని నెడబాయఁ
దగదు రా ననె నొక్క చిగురుఁబోఁడి
పల్లవుఁ డొకఁడు దర్పకకేళి కీవేళఁ
గాచినాఁ డనె నొక్క కంబుకంఠి
తే. ననువుకాఁ డొకఁ డాసించి వినయలీలఁ
దవిలి యున్నాఁ డనియె నొక్క ధవళనేత్ర

విటశిరోమణి యొకఁ డిలు వెడలనీక
దంట యై యున్నవాఁ డనె దంట యొకతె. 58

ఉ. మిండని బాసి రాఁదగదు మిన్నక పొండని నొక్క లేమ చె
ల్వొం డిదె చూడుఁ డట్లు గదిలోనియతండని నొక్క రామ భూ
మండలిఁ బేరు గల్గుసుమనుం బగుమేలిపసిండిసొమ్ము లీ
తం డొసఁగన్ గడించి చన ధర్మము గాదని నొక్క భామయున్.

తే. ఇట్లు చెలులెల్లఁ దమవిధం బెఱుఁగఁ జెప్పి
రందుఁ గొందఱు పోరిదలో నిందుముఖులు
మందమధురోక్తు లలరార మాన వేశ
కింకరుల కిటు పలికిరి శంక లేక. 60

క. వినుఁ డెఱిఁగించెద నెంతయుఁ
బనివడి గణికాజనంబుపద్ధతు లెల్లన్
వినయం బలరారఁగ నో
ఘనులార! సవిస్తరంబుగా నిఁక మీకున్. 61

గీ. విటుఁడు లేని రేయి వేదనఁ జెందుచు
నిదుర కంటి కెఱుఁగ నేర కుండి
కా పొసంగునట్టి కడజాతి వాఁడైనఁ
గల్గఁ గోరు వారకాంత మదిని. 62

సీ. కడుఁ గురూపిని నైనఁ గందర్పనిభుఁ డంచుఁ
నభినుతి యొనరింతు రలఘుశీల
నంత్యజన్ముని నైన నమలవంశజుఁ డంచుఁ
బల్కుదు రెంతయుఁ బ్రొద్దు నరర
నతిమూఢమానసుం డగు మానవుని నైన
సరసు డటందురు సరభసముగ
బ్రహ్మహంతకుఁ డైన బరమధార్మికుఁ డంచు
గణుతింతు రెపుడును గ్రమముతోడ

తే. నెన్నఁ గల్గిననీతివిహీనునైనఁ
దవిలి సద్వృత్తసం డందుఱి తమకు నొక్క
వీసమైనను గానైన వీడె మైనఁ
జేతి కొసఁగినచో నెలచిగురుఁబోండ్లు. 63

ఉ. చిన్నెల వన్నెల న్నగలఁ జిత్రవిధంబుల ముద్దుమాటలన్
వెన్నెల నెన్నునవ్వులను వేమఱు బిత్తరివాలుఁజూపులన్
సన్నల సైగల న్మిగుల జాణతనంబున వారకామినుల్
చెన్నుగఁ బల్లవప్రతతిచేత ధనంబులు దోఁతు రెప్పుడున్. 64

సీ. ఒకమాఱు పయ్యెద నోరగాఁ దొలఁగించి
సవరించు జిగిగుబ్బ చన్నులలర
నొకమాఱు సోగవెంట్రుకల బల్మనుకొప్పు
సడల జల్లున విప్పి ముడుచు మరల
నొకమాఱు మణిమయప్రకటభూషణములు
వదలించి తిరుగంగఁ గుదురుపఱుచు
నొకమాఱు నవ్యమౌక్తికమణీహారము
లొక్కనగోటఁ జెక్కుల గుచ్చి తివియుఁ
తే. జెలఁగి మఱియును శృంగారచేష్ట లలరఁ
గేరుచుండును బెక్కువిహారములను
సొబగుమీఱెను వగకానిఁ జూచినప్పు
డరయు గొల్పును వెలయింతి మహితగతిని.

చ. పొలుపుగ నిన్నుఁబాసి యొకపూఁట మహాయుగమంచు నెంచుచు
వలనుగ నీవు న న్నటుల వంచన సేయఁగఁ బాడియే? యిటుల్
దలఁపఁగ నీతియే? యనుచుఁ దక్కుచుఁ జొక్కుచు నిక్కవంబు
వలచినయట్లు మాయలను వారవధూటి భ్రమించుఁ బల్లవున్.

చ. ధనము లవేల పో యిపుడు దాసియు నైన గడించు నీక్రియన్
ఘనముగ మాను నీచెలిమి గల్గుటయే పదివే లటంచుఁ బె
న్వినయముమాట లాడుచును వేడుక కానిఁ గరంగఁ జేసి యొ
య్యన విభవంబుఁ గొండ్రు గణికాంగన లెంతయు నేర్పుమీఱఁగన్.

క. వలచినవానికిఁ బడఁతియు
వలచినచందమునఁ దోఁచి వదలదు గాకెం
దులనైన వెలపొలంతికి
వలపును గనకంబునకును వాసన గలదే? 68

వ. అదియునుం గాక. 69

సీ. పల్లవవ్రాతంబు పాలి బల్లాకాసి
ప్రకటితోద్యన్మద్యపాననిరత
గురుతరానేకదుర్గుణగణాలంకార
సకలమాయావాదజననసీమ
భూరికోపవికారపూరితనిజచిత్త
కఠినవాక్ప్రక్రియాగ్రథితరసన
ధర ననీతుల నెల్ల గుఱుతుమీఱినతావు
దానధర్మదయావిధానహీన

తే. శాకినీభూతభేతాళసముదదైత్య
భీకరాకార విలయగంభీరనినద
సుమశరారామమార్గభాసురసమగ్ర
లగ్నకంటకయుతవల్లి లంజెతల్లి. 70

సీ. కుఱుచలై తఱుచుగా నెఱిసిన వెండ్రుక
లొప్పు మీఱఁగ దువ్వి కొప్పు ముడిచి
యిలఁ బ్రాఁతచెప్పుటట్టలఁ బోలి వ్రేలాడు
కుచముల నవికచేఁ గుదియఁ బట్టి

తొడిగినకుబుసంబువడువున ముడత శే
ర్పడియెడునొడలిపైఁ బసపు రాచి
యెలుఁగుతోలును మీఱి యెంతయు మాసిన
పెద్దపుట్టము చాలఁ బ్రీతిఁ గట్టి

తే. బొఱుసునొసటను జంద్రింపు బొట్టుబెట్టి
యడుసుకన్నులఁ గజ్జలం బడర దిద్ది
బోసినోటను దమలంబు పూని యిటుల
విటులఁ బలుమాఱు నగఁజేయు వృద్ధవేశ్య. 71

తే. పద్మ మయినను దగుమహాపద్మమయిన
శంఖమయిన నొసంగినఁ జాలకుండి
ధనదు మెచ్చ దొకింతైనఁ దనకుఁ గల్గు
విత్త మంతయు నీకున్న వేశ్యజనని. 72

క. వసఁ ద్రాగినపులుఁగుక్రియ
న్విసువక తగఁ బ్రేలుకొంచు వేశ్యాంబ కడుం
బిసరేఁగి బూతులాడు
న్బసఁ గల్గనియోగి యడఁగఁ బల్లవతతులన్. 7

ఉ. ఆకులు పోఁకలు న్మణులు హారములు న్బహుగంధసారము
లోక్కలు రూకలు న్మదిని గోరినయట్టిసమస్తవస్తువు
ల్ప్రకట మొప్ప మాయలొగిఁ బన్నిభ్రమించుచునేర్పుమీఱఁగ
జేకొనుఁ బో విటావళులచే గణికాంబ విచిత్రవైఖరిన్. 7

గీ. మిండఁ డొకనాఁటిరేయి రాకుండెనేనిఁ
గాసువీసంబు చేతికిఁ గల్గనందు
కించుకేనియు నిదురఁ బోనీదు కూఁతు
గడవఁబూఁబోఁడి యవ్వ పెన్కంచుమువ్వ.

వ. ఇట్లగుటం జేసి పల్లవవిరహిత యైనవేశ్య మీ రిచ్చుధనంబుఁ
గొని జంగమవిటుని కడకు రాకుండునే యని యధార్థంబుగఁ
బల్కిన విని. 76

క. నమ్మిక నృపభటు లతిశీ
ఘ్రమ్మునఁ గ్రమ్మఁగొని సకలగణికాజనగే
హమ్ములు నిమ్ముగ దూఱి ము
దమ్మునఁ బరికించుకొనుచుఁ దగ నచ్చోటన్. 77

క. ద్యూతమధుపానమృదుసం, గీతసుసాహిత్యనృత్యకేళులచేతం
బ్రీతిఁ జెలంగుభుజంగ, వ్రాతంబులఁ గనిరి చిత్రవైఖరిమెఱయన్. 78

ఉ. ఈగతి నుండఁ జూచి ధరణీశ్వరుపాలికిఁ జారు లెంతయు
న్వేగమ చేరి తద్విధము విస్మయలీల నెఱుంగఁ జెప్పిన
న్వేగముచానఁ దే కిటుల బొంకులు బల్కుట మీ కొకింతయు
న్బాగగునే యటంచు నరపాలుఁడు కోపముమీఱఁ జూచుచున్. 79

క. ఉన్నంత పొరుగుపల్లెల
కు న్నేగినదూతలెల్ల గొబ్బున నప్డే
ఖిన్నత మీఱఁగ నటువలె
విన్నప మొనరింప ధరణివిభుఁ డవ్వేళన్. 80

ఎక్కడఁ జూచినం బురి నొకించుకయు న్నెడ లేక యెప్పుడున్
లెక్కకు నెక్కుడై గడనలేములు కాచుకయుందు రిప్పు డే
దిక్కున నొక్క వారసుదతీమణి కల్గకయుండు టెంతయున్
మిక్కలిచోద్య మంచు మది నిల్వక దిగ్గున లేచి యుత్తరిన్. 81
నల్లనిశాలు ముసుంగిడి, యెల్లజనంబులను డించి యింపొంద మహీ
వల్లభుఁడు తానె చనియె మ, హోల్లాసపువేశ్యవాటి కున్నతలీలన్. 82
ధీరుఁడు భూవరుం డిటులఁ దీవ్రగతిం జని తద్గృహంబులన్
సారణగండ్లపద్ధతులఁ జూడఁ దొడంగె విచిత్రలీలం

న్నేరుచుఁ గోరికల్ మదనకేళులఁ దేలుచు నుందువారలన్
భూరిసుగంధపుష్పమణిభూషణధారుల నిర్విచారులన్. 83

* * * * * *

వ. ఇట్లు చతురశీతిబంధనఖదంతక్షతపరిరంభణాద్యనేక కామశాస్త్రప్రకారంబులం దవిలి క్రీడించుచున్నం గనుంగొని శివశివేతి మంత్రంబును బఠించుచు విఫలప్రయత్నుం డై ధాత్రీవల్లభుండు తన మనంబున వితర్కించె. 84

క. చారులు చెప్పినవిధ మిపు
డారయఁ దథ్యంబ యయ్యె నవ్విటునకు నిం
కేరీతి నొసఁగఁ గల్గుదు
వారవధూమణిని వ్రతము వడి నిల్పుటకున్. 85

క. వెలపొలఁతి గల్గనందున
నిల యేలెడురాజు నంచు నెవ్వతె నైనం
బలిమి దెప్పించిన నిది
కలుషంబులకెల్ల మొదలు గాదె తలంకన్. 86

చ. కడు నడురేయి యయ్యె నని కల్లరిజంగము క్రోధచిత్తుఁ డై
వడి నదలించి పల్కునొకొ? వంచనమీఱ వ్రతంబు మీఁదట
న్విడువఁగఁ బోలునో? భువిని విశ్రుతమౌ నపకీర్తి నొందఁగాఁ
బడునొకొ? నీలకంధరునిభాస్వదనుగ్రహ మెట్టు లున్నదో? 87

తే. వేశ్య నొసఁగెద నని మున్ను విశ్వసింపఁ
బలికి యిపు డెట్లుబొంకుదుఁ బాడిదప్పి
మహి నసత్యముకన్నఁ గల్మషము కలదె
నేటు సేయంగ మానవకోటులకును. 88

తే. మును హరిశ్చంద్రముఖ్యు లౌ మనుజపతులు
నిత్యసత్యవ్రతాచారనిపుణు లగుటఁ

గాదె చిరకీర్తి సకలజగంబులందుఁ
జెంది నిర్వాణరాజ్యాభిషిక్తు లైరి. 89

క. కరి హయ భట రథ శిబికాం
బర ధనమణిభూషణాదిబహువస్తువు లి
ద్ధర నెన్నఁగ సతతంబులై
తరముగ సత్కీర్తిదక్క ధీరాత్ములకున్. 90

క. మును దీక్షయొసఁగు వేళను
ఘనుఁ డగు గురునాథుఁ డెంత కాదని యనినన్
విన నొల్లక వ్రతభంగం
బొనరింపఁ దలంచు టిప్పు డుచితం బగునే. 91

క. అదిగావున నవ్విటునకుఁ
గొదుకక పట్టంపుదేవి నొసఁగి ధరిత్రిన్
విదితం బగుశపథము కో
విదు లెన్నఁగ నిల్పికొనుట విహితం బనుచున్. 92

ఉ. అవనితలేంద్రుఁ డెంతయు ద్వయంబ గృహంబున కేగి యంతత
పరివిమలశీలయైన తనభామిని నొయ్యనఁ జేరఁ బిల్చి యో
ధవళసరోజనేత్ర ! విను ధర్మయుతం బగునొక్క వాక్యముఁ
దవిలినభక్తితోడ విదితంబుగ నీ కెఱుఁగంగఁ జెప్పెదన్. 93

సరసముమీఱ నొక్కవిటజంగము ధూర్జటిఁ బోలి నేఁడు దా
నురుతరలీల నెయ్యెడల నుండియొ వేగమె చేరి నన్నభ్యం
తరమునఁ జూచి యెంతయు ముదంబున దీవెన లిచ్చి కోరు ముఁ
గుఱుతుగ నొక్కవారసతిఁ గోర్కె నొసంగుము ఘటించుఁ బల్కినన్

క. ఇయ్యకొని భటులచేతికి
నెయ్యంబున ధన మొసంగి నెఱి నొకపుష్పం

దౌర్యాలిఁ దెమ్మని పనిచియు
నయ్యెడ వారలను నమ్మ కతిశీఘ్రమునన్. 95

సీ. చని వేశ్యవాటి యెల్లను గ్రమక్రమమున
వెదుకంగ నందు నవ్వేలందు లెల్లఁ
బల్లవసహితలై పరిపరివిధముల
గులుతుగా మరు కేళిఁ గూడుచున్న
గనుఁగొని వ్రతభంగమునకు నెమ్మది జాల
వెఱచి యెంతయును వివేకిని వని
నీకు నివ్విధ మెల్లఁ బ్రాకటం బలరారఁ
దెలుప వచ్చితి నతిశీఘ్రఫణితి

తే. సింధుముఖి యెన్నఁడు నెఱుంగ నిట్టిచోద్య
మభవుబలు మాయ కాఁబోలు నైన నీదు
బుద్ధితో డుత నూహించి పొసఁగ నొక్క
వాక్య మిట్లని పల్కుమా వలను మీఱ.

క. అనుమనుజాధీశ్వరునిం
గని మృదుమధురోక్తు లలరఁ గాంతామణి యి
ట్లను హృదయాధీశ్వర మును
విన వే శితిగళునికథలు విబుధులవలనన్.

చ. చిరతరలీల భక్తతతిచిత్తము లారయఁ గోరి యీశ్వరుం
డరుదుగఁ బెక్కురూపుల నహర్నిశముం జరియించుఁ దొల్లిఁ ద
దురితవిదూరుఁ డైనచిరుతొండనినిశ్చలభక్తిఁ జూడఁ ద
ద్వరనుతుఁ గూరఁగా నడిగి వానికి నీఁడె మనోహరార్థముల్.

తే. అవ్విభుఁడె మున్ను పొదిలె నిమ్మవ్వనుతుని
బూని చంపించుకొఱకునై పోయిదాని.

నధికతరహర్ష మొప్పార నన్ను మొనర
వేఁడుకొన్నట్టిబల్మాయలాఁడు గాఁడె. 99

క. అట్టి శివదేవునకు నీ
పట్టున నిన్నడుగు టెంతపని సుగుణుఁడవై
మెచ్చిన నొసఁగి శపథము
గట్టిగ నిల్పుకొననలయు ఘనతరలీలన్. 100

మ. నను నెంతేనియుఁ బెద్దఁ జేసి నలినీనాథాన్వయోత్తంస! యి
ట్లనఁగా ధర్మమె? నీవు నాపతివి తథ్యం బేను నీదాసి నిం
దనుమానింపక మీమదిం గలుగున ట్లత్యంతమోదంబుతో
నొనరింపందగుగాక పల్కులును మీ రూహింప నింకేటికిన్. 101

క. పురుషుఁడు దైవం బతఁడే
కరణి నియోగించు నదియె కావించుట కా
కరయఁగ మఱియెందైనం
దరుణుల కొక్కింతయును స్వాతంత్ర్యము గలదే! 102

క. సలలితముగ నిహపరసుఖ
ములు రూఢి నొసంగి సకలపుణ్యఫలంబు
ల్గలిగించు విభునికంటెను
తలిరుంబోఁడులకు వేఱు దైవముగలదే. 103

సీ. కాంతామణులకుఁ జొక్కపుఁబెన్నిధానంబు
ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
కుసుమగంధులకును గొంగు బంగారంబు
ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
కమలాక్షులకు నభీష్టము లిచ్చుదైవంబు
ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
చిగురుబోఁడులకుఁ జెల్వగుకల్పభూజంబు
ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు

తే. చంద్రముఖులకు బహుజన్మజనితదురిత
పటలతిమిరార్క బింబంబు ప్రాణవిభుఁడు
పొలఁతులకుఁ జాల వెలలేనిభూషణంబు
రాజశేఖర! పరికింపఁ బ్రాణవిభుఁడు. 104

క. వ్రతములును దానధర్మము
లతులితగురుదేవతార్చనాదులు విను మో
క్షితినాథ! యింపుకేనియుఁ
బతిభక్తికి సాటియగునె భామామణికిన్. 105

ఉ. కావున నెల్లరీతులను గర్తవు నీ వెటులానతిచ్చినం
బావనలీలఁ జేకొనక పల్కుట యెట్లది కాదటంచు ధా
త్రీవరముఖ్య! నిక్కముగఁ దెల్పుము చింతిల నేటి కిక్రియన్
భావభవారి భక్తతతిపాలిట నెప్పుడుఁ గల్గి యుండఁగన్. 10(

క. అన విని జవనాథుఁడు వే
దన నొందుచు నవ్విశాలధవళేక్షణ న
క్కునఁ జేర్చి వదలి క్రమ్మఱ
ననియె న్మదితొట్రుపడఁగ నభినవలీలన్. 1(

ఉ. ఓసరసీరుహాక్షి! విను మోకులపావని! యోవధూమణీ!
నీసరి యేరి మానినులు నేటొనరింపఁగ ముజ్జగంబుల
న్వాసిఁ నేఁడు నాపలుకువాక్యము మీఱఁగ వేశ్యకాంతవై
భాసిలి జంగమేశ్వరుని భావజకేళిఁ గఱంగఁజేయుమా. 1

ఉ. వారక యీపురి న్నిచట వారవధూమణి గల్గ నందునన్
వారిజనేత్ర! నిన్నిటుల వంచనసేయక వేడ్కకత్తెగాఁ
గోరినవారజంగమునకుం దగ నీవలసెంగదా మదిన్
నేరము లెన్నకియ్యెడల నిల్పుము మద్వచనప్రకారముల్.

ఉ. నీవు పతివ్రతామణివి నీవలనం దగ మెచ్చి మేచక
గ్రీవుఁ డభీప్సితార్థములు ప్రేమ నొసంగెడు సంశయం బెఁకన్
భావమునందు నిల్పక కృపామతిఁ జూడుము నన్ను నియ్యెడన్
నావుడుఁ బువ్వుఁబోఁడి తననాథునకిమ్ముగఁ జెప్పి యిట్లనున్.

క. వలనొప్ప నింతపనికై
పలుమఱుఁ బ్రార్థింప నేల పావనమతితో
నలబోజుఁగుజంగమునకుం
జెలువుగ నన్నొసఁగవలయు శీఘ్రమున నృపా ! 111

క. ధరయెల్ల గుత్తఁగొని యొక
దరి నించుకత్రాప్తు దీనత న్వేడుక్రియన్
బరికింపఁ నిటుల హృదీ
శ్వర ! కొంచెపుఁబల్కు పల్కవచ్చునె నీకున్. 112

ఉ. భూనుతలీల మున్ వ్రతముఁ బూనితి రెడ్డియు నిత్తుమంచు జం
గానకు వారకాంత నిడఁగా నొకకూడనియంతమాత్రనే
దీనతఁ బల్కఁబాడియె సుధీజనులెల్ల హసింప ? నెందునే
నేనుఁగు నెక్కి చక్క నవనీశ్వర ! శక్యమె దిడ్డి దూఱఁగన్. 113

చ. అను వినుతాంగిపల్కులు దినాధిపవంశపయోధిపూర్ణిమా
వనజవిరోధి యెంతయు నవారితమోహనిబద్ధచిత్తుఁడై
విని యొకయింత సొమ్మసిలి వేగమె తెప్పిరి యోషలంత ! యి
ట్లనగతి గంటిఁగాక తగదా మదినీక్రియ నూహసేయుటల్ ? 114

క. ఆడినమాట తగ న్విడ
నాడక నైకొన్నమాత్ర నకటా మదిలో
నోడక విటవరునకు నీఁ
బాడియె సువివేక ముడిగి పంకజగంధీ ! 115

తే. పద్మదళనేత్ర! నిన్నెడబాసి యొక్క
నిమిషమేనియు నోర్వంగ నేర్తు నెట్లు!
పరమసాధ్విని నిన్నిట్లు పల్కినట్టి
తప్పు క్షమసేయుమా మది దయదలిర్ప. 116

క. ఈయెడ సింతయు నానతిఁ
జొరియక గైకొంటి నెమ్మితో మఱియెందుఁ
నీయట్టిసతులు గలరే
వేయూఱులలోన నైన విమలేందుముఖీ! 117

ఉ. చంచలనేత్ర! నామదికి సమ్మతిగా నిపు డొక్కమాట యూ
హించి దయన్వచింపుము మహిం జిరకీర్తులనేకభంగులన్
నించు మటంచుఁ బల్కుటయు నీలమధువ్రతవేణి నేరుపు
ల్మించఁగ నన్నరేశుని లలిం గని యిట్లనెఁ బ్రోడజాడలన్. 118

తే. క్షితిప! యిటుల విచారంబు సేయుచుండి
చిన్నమాటలు పలుకంగఁ జెల్లదిదియుఁ
గాక మత్స్వాంతవృత్తియుఁ గనుఁగొనంగఁ
దలఁచితేనియువినుము డెందమునలర. 119

సీ. జననాధ! విను హరిశ్చంద్రావనీంద్రుండు
గాధేయుకొఱకు లోకంబు లెఱుఁగ
ధారుణీభారమంతయు వేగఁ బోనాడి
తనపొలంతిని బుత్రు నొనర నమ్మి
మునుకొని యంత్యజన్ముని వెంట మధుమాంస
ములు మోచుచునువానిఁ గొలుచుచున్న
నంత నవ్విభునిసత్యవ్రతంబున కాత్మఁ
గరుణించి నిజభక్తవరదుఁ డైన

తే. కాశికావల్లభుఁడు జగత్కారణుండు
విశ్వనాథుండు చండికాధీశ్వరుండు
ప్రేమ సాక్షాత్కరించియభీష్ట మొసఁగి
కావఁడే వారి నత్యంతకౌతుకమున! 120

క. నీవాడినవాక్యం బిపు
డేవిధమున నైన నిర్వహించినదానన్
భావజదమనుఁడు కరుణం
బ్రోవఁగలం డాత్మ నలరి భూవరతిలకా! 121

ఆ. భక్తి విడకయుండు భల్లాణ! యివ్వేళ
మది దృఢంబుమీఱ మట్టుపఱచి
సేయుకార్య మిఁకను జింతింపవలదు
నాకు నైనఁ గడువిస్మయగతిని. 122

సీ. అను ఘనజఘనఁ గన్గొని యను జనపతి
విను వినుతాంగి! శోభనత దనర
నీచిత్త మరయంగ నీచ్ఛందమున నొత్తి
చూచితి నిజమది చోద్య మలర
నిరువురహృదయంబు లేకమై యుండినఁ
గోర్కెలన్నియు నొనఁగూడఁగలవు
మొనసి నిన్ని వేషమున నొసంగినయప్పు
డవ్విటవరుఁడు క్రోధాత్ముఁ డగుచు

తే. వారకామిని దే కిటు లూరిలోన
వరుని నెడబాసి యొంటిమై సరవి నున్న
యట్టిమగనాలిఁ దెచ్చి తీవనుచు నొల్ల
కాజ్ఞ యొనరింపఁగలఁ డమితాగ్రహమున.

క. కావున నిస్త్రీరూపము
తో విటశేఖరునికడకుఁ దోడ్కొనిచనఁగా
దీవేళ వేశ్యకామిని
నై వేగమె రమ్మటంచు ననిచినయంతన్. 124

క. అంతిపురి కరిగి యయ్యాలి
కుంతల వెలయింతి యాడుటకుం జనుచున్నన్
అంతం గని యెంతేనియు
సంతసమున మల్లికాంబ సవతికి ననియెన్. 125

శా. కల్లల్గావు విరాళిఁ గొన్నవిటజంగం బంగనం గోరుచో
నుల్లం బెల్లను బల్లవింప నను నీ నొప్పింప కోచల్లమా
భల్లాణక్షితిపాల శేఖరునకుం బట్టంపుఁబూఁబోఁడి వై
చెల్లంబో యిటువంటిచుల్కనిపను ల్సేయంగ నీ కర్హమే? 126

క. ఓయప్ప వారకామిని
చా యిప్పు డలంకరించి కర మొప్ప మనో
నాయకునికడకుఁ దోడ్కొని
వేయరుగఁగదమ్మనన్ను వికచాబ్జముఖీ. 127

తే. అనెడుకూరిమిసవతి నెంతేనిఁ గరుణ
మీఱ నవ్వారిజాక్షి తా గారవించి
పలుకు నిట్లని యోహోముద్దుకలికి మేలు
చెలఁగి నీబుద్ధి వేవేలు సేయఁజాలు. 128

ఉ. నీరజగంధి నీవనుచు నే ననుచు న్మది భేద మెద్ది యె
వ్వారికతంబునన్ వ్రతము వంచన నొందకయుండి భక్తియొ
ప్పారినఁ జాలు నీవ చను మాత్మ గ్రహించిపుడట్టు లుండఁగా
నేరవు కామశాస్త్రగతి నిక్క మెఱుంగవు గ్రోల వారయన్. 129

క. ఇభరాజయాన మును నీ
విభుకౌఁగిట మెలఁగుచుండు విధమంతయుఁ గా
దభినవవిలాసనుమశర
నిభుఁ డయ్యతి రతిరహస్యనిపుణుఁడు సుమ్మీ! 130

ఉ. చొక్కులఁ దక్కుల న్నిగుల సొంపగు తేటమిటారిచూపులన్
జక్కనిమందహాసములఁ జారువిలాసముల న్సలీలఁ బెం
పెక్కుడుదివ్యవాసనల నింపగుతియ్యనిముద్దుపల్కుల
న్నిక్కపువారకాంతకరణిన్ వలపింపవలె న్భుజంగునిన్. 131

తే. మఱియునసమాస్త్రశాస్త్రప్రమాణసరణిఁ
దవిలిపురుషాయితాదిబంధములయందుఁ
బ్రోడవై కూడలువలయు నేర్పునఁ జెలంగి
పల్లవునియుల్ల మల్లనఁ బల్లవింప. 132

క. అటుగాక హృదీశ్వరుచెం
గట నేనియ్యకొని వచ్చి క్రమ్మఱ నిపు డో
కుటిలాలక! నిన్నంపినఁ
బటువైఖరి నలుగఁడే నృపాలుఁడు చెపుమా? 133

తే. అని సవతి నూరడిలఁ బల్కి యాక్షణంబ
చల్లమాదేవి తుది లేని సంతసంబు
దనరఁ బతిహితమునకు నై తానె వేగ
మున సలంకృతి యొనరించుకొనఁదొడంగె. 134

తే. సుందరులు గొందఱప్పుడయ్యిందుముఖికిఁ
గుందనపుబిందియలయందుఁ బొందుమిగుల
నెంచఁగలిగిన పన్నీరు నించి చాల
నంద మొప్పార జలకంబు లార్చి రాగిని. 135

క. ఉడురాజవదన యొక్కతె
తడియొత్తె న్రాజసతికి ధౌతాంబరముల్
వడిఁ దాల్చె నెసఁగ సొగసుఁ
గడువేడుకతో నొకర్తు కాంతామణికిన్. 136

ఉ. సొంపుగ నింద్రనీలమణిశోభల నేలఁగఁ జాలి సోగలై
పెంపెసలారుముంగురులఁ బెద్దయుఁ గ్రొమ్ముడి దిద్ది దిక్కులన్
ముంపుచుఁ బెంపుమీఱెడు సమున్నతదివ్యసుగంధయుక్తమౌ
సంపెఁగదండఁ జుట్టె నొకసారసనేత్ర నృపాలపత్నికిన్. 137

ఉ. ముద్దులగుమ్మ యోర్తు చెలిముందర గొప్పమెఱుంగుటద్దముం
దద్దయు నిల్పె నొక్కవనితామణి కస్తురిబొట్టు మోమునం
దిద్దెఁ బడంతి యోర్తు సొరిది న్మకరీమయరేఖ లెంతయున్
ముద్దియతళ్కుఁజెక్కులను మోహనలీల లిఖించె నేర్పునన్ 138

చ. కలువలఁ గేరుచంద్రముఖికన్గవ నొక్కవధూలలామ చె
ల్వలరఁగఁ గజ్జలం బిడియె నబ్జనిభానన యోర్తు వేడ్క రం
జిలఁగను నీలవేణి జిగిసిబ్బెపుగుబ్బలపైని జొబ్బిలం
గలప మలందె నంచితసుగంధయుతంబుగఁ జిత్రవైఖరిన్. 139

సీ. చారుముక్తాహారవారము ల్గళమున
నించె వేడుక నొక్కమించుబోఁడి
సౌవర్ణకర్ణభూషణము లందముమీఱఁ
దగిలించె నొకశీతధామవదన
ఘనమైన పచ్చలకడియంబు లిరవుగా
బెట్టెఁ జేతుల నొక్కబిసరుహాక్షి
కమనీయరత్న సంఘటిత మై చెలువొందు
మొలనూలిడియె నొక్కమోహనాంగి

తే. పాదముల నందియలు బెట్టి భామయొకతె
నుదుటఁ జేర్చుక్క నిడె నొక్క సుదతిమఱియుఁ
బేరుగలభూషణములెల్లఁ బ్రేమ నిడిరి
రమణు లింపార నప్పు డారాజసతికి. 140

వ. ఇట్లగణ్యశృంగారధారిణి యై యనంతరంబ. 141

సీ. ఘనసారచందనకస్తూరికాముఖ్య
దివ్యగంధంబులు దిశలఁ బర్వఁ
గింకిణీనూపురక్రేంకారనాదము
ల్కడునింపుమీఱ నొక్కటఁ జెలంగ
ఘనరత్ననికరసంఘటిత మై తనరారు
నవ్యకాంచనభూషణములు మెఱయ
భూరికుంతలబంధభారంబుచే మించి
మంద మై నడకలు సందడింపఁ

తే. బీనకుచకుంభయుగళంబు పేర్మిఁ బొదల
లలితశృంగారలీలావిలాసములను
వాసి మీఱంగ నమ్మహీవరునికడకు
నింతి యరుదెంచె మదనునిరంతి యనఁగ. 142

క. ఈరీతి నతులతరశృం
గారము దనరారవారకాంతయుఁ బోలెం
జేరి తనయెదుట నిలిచిన
నారీమణిఁ జూచి ధరణినాథుఁడు వేడ్కన్. 143

క. ఈలలనారత్నం బీ
నీలాలక యీవినిద్రనీరజముఖి యీ
లీలావతి తగు నేఁ దన
పాలిటిజంగమున కంచుఁ బ్రణుతించి వెసన్. 144

తే. భూమివిభుఁ డంతఁ దనయంతిపురము వెడలి
నెలఁతఁ దోడ్కొనియరుగఁ జో నింగినుండి
చూచి సురకాంత లెంతయుఁ జోద్యమంది
యెల్లవారును దమలోన నిట్టులనిరి. 145

సీ. ధారుణీశ్వరుబుద్ధి పూరి మెసఁగఁబో
సరగ నెం దుండియో జంగ మొకఁడు
చేరి వారాంగనఁ గోరినతఱి నియ్య
గొనకొని యెచ్చట గొదువకాని
తనభక్తి చెడకుండ బనివడి వేశ్యగా
నిల్లాలిని నొసంగ నిట్టిచిత్ర
మెప్పుడు ననువార లొకకొందఱును భళా
చాన యొక్క తెయైన మానవేంద్రుఁ

తే. డేటికి నొసంగు ముద్దియ లిద్ద ఱగుటఁ
జేసి వారలు తమలోన జెలగి పోరు
చున్న గన్నెని యిపు డిచ్చుచున్నవాఁడు
గాని నిక్కంపుభక్తిగాఁ గలదె యిటుల ? 146

క. ఇచ్చిన నిరుపుర నొక్కట
నచ్చం బగుభక్తితోడ నర్పింపక యీ
కుచ్చితములు తగ వనుచున్
మెచ్చక యొకకొంద ఱేమిమే లనువారుఁ. 147

చ. పురములు వాహనంబులును భూషణము ల్ధనధాన్యము ల్నవాం
బరములుఁ బాఁడిధేనువులుఁ బ్రార్థనసేయక జంగమయ్య యే
తెఱఁగున వేశ్యఁ గోరె ! నతిధీరత నట్లతఁ డింతిఁ గోరినన్
ధరణిపుఁ డెట్లు లియ్యకొనెఁ ! దా నని పల్కెడువారు కొందఱున్

క. ఇయ్యకొని వారసుందరి
యెయ్యెడలం గల్గకున్న నిల్లాలి నిటుల్
చెయ్యన నొసఁగుట ఘనతయె
యియ్యిలపతి కనుచుఁ గొంద ఱెన్నెదువారున్. 149

సీ. ఆసరోరుహనేత్రయైనఁ గాదన కిట్లు
పతివెంట వేశ్యయై భవ్యగతిని
జనినంత భక్తియే యనువారు కొందఱు
గట్టిగా భక్తిమార్గంబు పూని
నప్పుడే భక్తుండు చెప్పినవిధమెల్లఁ
జేసిన నిల్లాలు సేయకున్న
నదియపో చిత్తిని యనువారు గొందఱు
సతికి భర్తకు నొక్కమతియయైనఁ

తే. గల్గు నభిమత మిది కల్ల గాదు నృపుఁడు
లీల నీజంగమునకు నిల్లాలి నొసఁగి
హరుని మెప్పించి బొందితో నరుగఁగలఁడు
సరగఁ గైలాసమున కెల్లజనులు నెఱుఁగ. 150

క. అనువా రొకకొందఱు నై
కనుఁగొన నవ్వేళ నృపతి కాంతామణి దా
డొక్కని చని యలజంగమరా
యనిసన్నిధి నునిచి యిట్లు లనియెం బ్రీతిన్. 151

క. తగుచిగురుఁబోఁడిఁ దెచ్చితి
నొగి మీకుఁ బరిగ్రహింపుఁ డోసామి! యనన్
నగుమొగ మలరఁగ నపుడ
జగతీపతితోడ యోగిచంద్రుఁడు పల్కెన్. 152

తే. రమ్ము బల్లాణ నిక్కంపురాజ వనుచు
నెమ్మదిని జాల నీమాట నమ్మియుంటి
మెంతదడవయ్యెఁ బడఁతిఁ దే నేగియిపుడు
పూనినయోజయెంతైనమానఁగలదె ? 153

క. రంగుగ జంగమవిటుఁడను
చుం గడు నిబ్భంగిఁ జులకఁ జూచితొ తలఁపక
వెంగళివి భూప ! నీ కే
సంగతి నలరారు మానసము నామీఁదన్. 154

సీ. కామాంధకారినై కడఁకతో నీరాకఁ
గాచుచుండఁగ మూఁడుకన్నులయ్యెఁ
దలయేఱు బరువయ్యెఁ దగ మేను సగమయ్యె
గళమూలమునఁ జందునిలుకడయ్యె
వలనొప్ప మునుపటివగ దప్పె వలపును
విరిగెను నడురేయి సరవి నయ్యె
నా కేటి కీవేశ్య నీ కేటినిజభక్తి
బూటకంబులచేతఁ బ్రొద్దుఁగడపి

తే. నాఁడవింతియకాక భూనాథ లెచట ?
వ్రతము లెచ్చట ? ఘనశైవమతము లెచట ?
నెందుఁ గొఱగానిపొలఁతుక నిటులఁ దెచ్చి
యందుకొమ్మనువా రెందునైనఁ గలరె! 155

వ. అని వెండియు నిట్లనియె. 156

తే. అనవలసి నిన్ను నిటువలె నంటిఁ గాక
తగునె వేశ్యలతోఁ బొందు తాపసులకు
నలసితివి భూప! మాకునై యధికముగను
దీనిఁ గైకొమ్ము నీవైనఁ బూని యిఁకను. 157

సీ. అనువిటవరునిఁ గన్గొని వినయోక్తి ని
ట్లను మనుజాధీశుఁ డనువుమీఱ
నయ్యలు మీ రెట్టు లాడినఁ దగుఁగాక
క్షితి నయ్యలకుఁ దెచ్చుచిగురుఁబోండ్ల
నవ్వాలుగాఁ జూడ నర్హంబు మాకును
దవిలి మీ కిట్లాడఁ దగునె యమ్మ?
నాఁకలి గొన్నచో నన్న మెవ్వరికైనఁ
గలిగిన విడనాడఁ గాదు సుమ్ము
తే. మీమదికి సంతసం బైనమీననేత్ర
నరయుచుండంగఁ దడవయ్యె నయ్య యింకఁ
దప్పు లెన్నక కైకొమ్ము తరుణి నిపుడు
కరుణనని భక్తి నడుగుల కొరుగుటయును. 158

క. నృపతిఁ గృపఁ జూచి యపు డా
కపటపువిటజంగమయ్య కడునవ్వుచు నో
తపనకులవర్య! యోర్చుఁగ
నిపు డాడితిఁ గాక సాటి యేరీ నీకున్. 159

ఉ. కావలె నన్నమాత్రమున, గౌతుకముం జెలువారఁవారరా
జీవదళాక్షిఁ దెచ్చితివి చెన్నలర న్బదివేలు సేయు నీ
భావజుచేతిమేలినునుబంగరుబొమ్మను ముద్దుగుమ్మన
జీవునకు న్విధాతకును శేషునకుం దరమే నుతింపఁగన్? 160

క. ముద మొదవఁగ నలచందురుఁ
గదుమఁ దివురు నువిదనుదురు కడుఁ బొదలెడు తు
మ్మెదకొదమకదుపుఁ జెదరఁగ
నదలించు న్నుదతి మృదువు లౌ పెన్నెరులున్. 161

క. వాసిగ నీసుదతీమణి
నాసము నాసమమె యంచు నవగంధఫలి
న్భాసురగతి గ్గెని పరి
హాసం బొనరించు సంతతాంచితలీలన్. 162

తే. చెలఁగి జగములు గెలువంగఁ దలఁచియిడిన
మరునిబలుసింగిణీవిండ్లు తరుణిబొమలు
కడఁక నవ్విండ్లఁ బూన్చినకలువతూఁపు
లీపయోజాననమిటారిచూపు లరయ. 163

క. చిగురాకు కెంపుబింబము
పగడంబును జెందిరమును బంధూకము ని
మ్నగుచయధరమ్ముతోడుతఁ
దగునే తుల యనఁగ నెట్టితావుల నైనన్. 164

క. పలువరుస మొల్ల మొగ్గల
పలువరుసఁ గెల్వఁ జాలు భామినిను జె
క్కులు తళుకుటద్దములతోఁ
గలహించుం దొమ్మిదులను గర్ణము లెంచున్. 165

తే. చెలువపలుకులు గండుఁగోయిలల నేలు
నెలఁతచిరునవ్వు లేఁతవెన్నెలల నవ్వుఁ
గలికికంఠంబు క్రముకంబు నలరు భిన్న
ములుగఁగావించు నెంతయుఁజలముమీఱి. 166

చ. పరువడి నంచితంబు లగుబాహుమృణాళములొప్పు గొప్పలై
యఱుతను వ్రేలుమౌక్తికపుహారములంచులఁ జీరులాడఁగా
గుఱుతుగ నెవ్వెలందికుచకుంభయుగం బలరు న్మనస్సరో
వరముల సంభవించి చెలువం బగుతామరమొగ్గలో యనన్. 167

చీమబారును గేరు నూఁగారు
వళు లబ్ధి వీచికావళుల నేలు
ఇసుకదిన్నియలతో వెసఁ బోరుఁ బిఱుఁదులు
కరితుండముల నెగ్గులరయుఁ దొడలు
మెఱయుకాహళులతో ఘొనయును జంఘలు
పాదయుగ్మము కచ్ఛపములఁ దోలు
నఖపంక్తి పరుమాఱు నగుఁ దారకంబుల
నడలు రాయంచలఁ దొడరి యెంచు

తే. మేలిమిపసిండిచాయల గేలిసేయుఁ
బూని నిక్కంబుగా దీనిమేనికాంతి
యెందు నిటువంటి చెలువైన యిందువదన
కలదె? పరికింప మార్తాండకులవరేణ్య ! 168

క. అని వనిత నెంచి యాగురు
వను నో జననాథ! నీగృహమునకు మముఁ దో
డ్కొని చను వేగమ యిఁకఁ ద
క్కినతావులు వలదుసు మ్రొగిఁ మాఁకనుచున్. 169

క. నరపతి వల్లే యని య
గ్గురునకుఁ గైదండ యిడుచుఁ గొమరొప్పఁగ నా
యిరువురఁ దోడ్కొని తనమం
దిరమునకుం దెచ్చి యునిచి తిర మగుభక్తిన్. 170

గీ. అర్ఘ్యపాద్యాదు లొసఁగి ప్రహర్షుఁ జేసి
యిలు వెడలివచ్చితగఁదన వెలఁదికనియెఁ
గలికి ! యిన్నాళ్ళు నాయక్కు గాఁగిలించు
వరుస నీజంగమయ్యకే వలయుఁజుమ్ము. 171

క. కాదేని దునియలుగ వడి
మోఁదెద నని చేత ఖడ్గముం బూని మహా
హ్లాదమున నుండె నొకదరి
నాదిత్యకులాంబునిధి శశాంకుఁడు పేర్మిన్. 172

ఉ. అయ్యెడఁ బల్లమాంబ విభునానతిఁ గైకొని వాఁడిచూపు లొ
య్యొయ్యన మీఱ లేనగవు లొప్పఁగఁ జెక్కులఁ బొఱలీవిమైఁ
బయ్యెదజాఱ ముద్దునునుఁబల్కులు చెల్వలరార నవ్విటుం
జయ్యనఁ జేరి మ్రొక్కి నెఱజా ణగు పెల్ల నెఱింగి రంగుగన్. 173

క. చెఱకులు గొబ్బరియును శ
ర్కరయుం బాలును ఘృతంబు కలపంబులున్
నెఱి ఫలరసాన్నములు గ్రొ
వ్విరులు న్గడు నొసఁగి యంత వేడ్కలు మీఱన్. 174

గీ. పండుటాకులు కపురంబు బాగములును
ముత్తియపుఁజూర్ణమును గూర్చి ముగ్ధ విడెము
చుట్టి యొసఁగుచుఁ బవళించి సుభగలీల
నున్న యద్దేవుచరణంబు లొత్తుచుండె. 175

క. పరిభాషింపఁగఁ జూచిన
మఱి యావిటుఁ డించుకైన మాఱాడక సు
స్థిరముగ నుండిన నమ్మద
కరిగామిని యతనితోడఁ గడునడి ననియెన్. 176

సీ. ఏవిచారము లేక యిటు లున్నఁ జెంతను
జేరిన మే లేమి వారసతికిఁ
బల్కరించిన మాఱుపల్కవు మూఁగలా
గున రతి సేయంగఁ గోర విపుడు

బోరియుంగ శిశువ వింతయుఁ గావు
కడురూఢి నున్నావు గండుమీఱి
యిత్తఱి నీకింత మెత్తదనం బేల
జాగు మానుము పొద్దు చాల నరిగెఁ

తే. బురుషుఁ డొఁగిఁ జేయి. సేయకే పొలఁతిచేయి
చేయరాదనిచూచినఁ జెలఁగియున్న
కొనువ లెన్నఁదలంచియో గుట్టుతోడ
నున్నవాఁడవు? నీ కిది యొప్పదనఘ ! 177

చ. సరసము మీఱఁ గేరుచును శయ్యకుఁ దారిచి కౌఁగిలించి సు
స్థిరముగ మోవి యాని నునుఁజెక్కులు గోళ్ళుల నొత్తి లీలఁ బ
ల్కుచు మరుకేళిఁ గూడి చెలిమానసముం గఱఁగింపకున్న నె
న్నరు నరు లింతయు న్మగతనం బని పూని భుజంగపుంగవా! 178

క. అగుఁ గాని తె మ్మటంచుం
జిగురాకుంబోఁడి యతనిఁ జెనకినఁ దా ని
మ్ముగ లేవక స్థాణువనం
దగియున్న మహాత్ముఁ జూచి తనలో ననియెన్. 179

చ. శివశివ! సేవయెంతయును జేసినఁగైకొనుఁగానిఁయీవిట
ప్రవరునకించుకేనియును బొఱదు మోహము నెమ్మనంబునం
దవిలిపుడెంత లెమ్మనుచుఁదాబతిమాలిననుంగఱంగఁడీ
భువిఁజలికూటిపైనిడినఁ బొందలరారెడువెన్నకైవడిన్.

సీ. నిక్కువంబుగఁ దూర్పుదిక్కు వెల్వెలబాఱెఁ
జక్కనొక్కటవేఁగుజుక్కపొడిచెఁ
దామ్రచూడంబులు తవిలికూయఁదొడంగెఁ
జదలున నుడులు తేజంబుతప్పె

జారచోరాదుల సంచారములు వాసెఁ
గమలాప్తుఁ డుదయించు సమయ మయ్యె
నిపుడైన మరుకేళి నిచ్చ సేయఁడు మంకు
జంగ మివ్వీట చిహ్నాచనునె యెందు?
నీశ్వరా యెట్టి చిత్రంబొ యిది! యటంచుఁ
దత్తరింపక విభునిచిత్తంబుగాను
బలిమినైనను గావింతు నలరనితని
ననుచు విరిపాన్పుపై నెక్కె-యవ్వధూటి.

సీ. ఘనతరంబుగ దీపకళికలు నల్గడ
వెలుఁగఁ గప్రఁపుధూపములు చెలంగఁ
గాంచి సముంచిత ఘంటానినాదము
లొన్నయఁ బుష్పాడి భూతికరణేఁ దనరఁ
బరిమళాదులవింత బాగులు చెలువార
సొగసుపల్కులు శివస్తోత్రములుగ
నలరసన్మాశి గణాంబులు హారతులలీల
నమరంగ ఫలరసాన్నములు చాల

తే. లింగనైవేద్యములభంగి రంగుమీఱ
నతివ శివరాత్రి చేసెడుగతిని దనర
దేహ మభపున కర్పింపఁ దివిరి యపుడు
కరయుగము చాఁచి తుదిలేని కౌతుకమున. 182

తే. శంభుఁ డాచల్లమాంబహస్తములలోన
నివ్విధంబున బాలుఁడై నివ్వటిల్లి
యవ్వెలందుక మదిగట్టిదనుచు నోలిఁ
జనులఁ జేఁపూర వాపోయెఁ జన్నుఁగుడువ 183

సీ. చాటున నొదిగియున్న నృపాలుఁ
డనె సతి కద్భుతవ్యాంతుఁ డగుచుఁ
బాలఁతిరో! యిది యేమి పుట్టుగోడ్డాలైనె
యున్న దానికిఁజోద్యమొప్ప నిట్లు
శిశువు వాపోయెడిఁ జెప్పు ఘటించుఁ దా
లోపలికి కేగక లోతుఁ దెలియ
నడిగిన నిట్లను నవనీశ! కంటివా
మెచ్చుగా మిండఁడై వచ్చినట్టి
తే. యొడయఁడిప్పుడు బాలుఁడై యుండి పొగులు
చున్న వాఁడనఁగ స్మర నువిదతోడఁ
దరణివంశాంబునిధిశీతకిరణుఁడైన
ఘనుఁడు భల్లాణధారుణీకాంతుఁ డనియె. 185

క. బాలుని కివ్విటపద్ధతు
లేలా వల దనుచుఁ లిరుగడ నొనరఁగ
వేలుమును వేసిఘృతమున్
బాలును బోయుము చెలంగి బాలేందుముఖీ! 186

తే. నాపుడు లతాంగి యిట్లను భూపవర్యా
పాలు ద్రావఁడు కొట్టంగఁ గేలు రాదు
మూఁడుకన్నుల నలరి యున్నాఁడు చూడ
నితరులకుఁ జెల్ల దివ్వింత యింతయైన. 187

తే. అనుడు నృపుఁడింతిఁదోడి తెమ్మని యొడయని
నివ్వలికి మూఁడుకన్నుల యీశ్వరుండు
వెట్టిగొట్టను జేసి నటవేశ్య నడిగి
కొసరి మనభక్తి దెలియంగఁ గోరెనిట్టుల. 188

క. అనుటయు బాలునిఁ దోడ్కొని
వనితారత్నంబు వేఁగ ద్వారము వెడలన్
ఘనుఁ డాశంకరుఁ డంతట
మునుపటితన చిఱుత చందములు మాని వెసన్. 189

సీ. జడలలో మిన్నేఱు జాబిల్లి సికపువ్వు
పులితోలు నునుశాలు పునుకసరులు
చేత ముమ్మొనవాలు చిలువసూడిగములు
నొసటమిక్కిలి కన్ను విసపుఁగుతుక
నెలిమిడి మెయిపూఁత తెలిగిబ్బ తత్తడి
సగమేన గట్టులసామిపట్టి
మొగమునఁ జిఱునవ్వు మిగులఁ గూరిమిచూపు
వన్నెమీఱెడు పాఁపజన్నిదములు

తే. నలర నలువయు నెన్నుండు నఖిలసురులు
మునులు ప్రమథులుగొల్వసమ్మోదమునను
భవుఁడె సాక్షాత్కరించెఁ గృపాసమగ్రుఁ
డగుచు భల్లాణు నెదుట నత్యద్భుతముగ.

తే. అవ్విధంబునఁ బ్రత్యక్షమైనయట్టి
యవ్విరూపాక్షుఁ గాంచి సాష్టాంగ మొఱఁగి
ముదముతోడుతఁ గేల్దోయి మొగిచి యవని
నాయకుండిట్టులని నుతి సేయఁదొడఁగె.

చ. జయ జయ నీలకంఠ! పురశాసన! శంకర! ద్విడ్భయంకరా!
జయ జయ శాంభవీరమణ! చంద్రవిభూషణ! భక్తపోషణా!
జయ జయ దేవదేవ! మదసామజభంజన! యోగిరంజనా!
జయ జయ ఫాలనేత్ర! విలసద్గుణమండన! దైత్యఖండనా. 19

తుషారకలపారద పటీరతరశారద విశాలతరనీరద
రణసురాహిత విదారణ! జగద్భరణకారణ! మహాభయ
నివారణ! భృతైణాసూర! గణనాథ! శ్రుతిపారగ! జగన్నుత! ఘనోర
గవిభూష! రిపుహార! గరళాంకా! సారసభవార్చిత! సుధీర! సముదం
చితకృపారససమగ్ర! ఘనసారసమహాసా. 193

దండకము. జయ గిరిశ! సురేశ ముఖ్యామరస్తోమమౌళిస్థిత స్నిగ్ధచా
మీకరోదగ్ర రత్నప్రియుక్తావతంసప్రభాసంచయాంచత్పదాంభో
రుహా! భక్తలోకామరోర్వీరుహా! హారహీర కర్పూర డిండీర మం
దార గోక్షీర హారావళీ చారుకీర్తిప్రకాశా! మహేశా! కపర్దాంచి
తేందుప్రభామండల ప్రస్ఫుటద్దివ్యకల్లోలినీ కైరవేందీవరా! ధీవరా!
గ్రావరాట్కన్యకాచారువక్షోరుహద్వంద్వలిప్తాంగరాగ ప్రదీప్తోరు
కోరంతరా! సంతతోద్యత్సరోజాతాండభాండోదరా! భూరి
వేదండ చర్మాంబరా! తాండవాడంబరా జంభ జిద్రత్న!
శోభావిడంబోజ్జ్వలత్కంఠ హాలాహలా! వాలఖిల్యాది యో
గీంద్ర హృత్పంకజేందిందిరా! సుందరాకార! లోకైకవీరా!
సువర్ణాద్రిధీరా! భుజంగేంద్రహారా! మహోదార! వారాశిగంభీర
నారాయణస్తోత్రపాత్రాంచితానంద చారిత్ర నీదివ్య చారిత్రముల్
శ్రీశ వాగీశ భోగీశ దేవేశులున్ వర్ణనల్ సేయఁగాఁ జాల రే
నెంతవాఁడన్ మహానుభావుఁడన్ నీవు కారుణ్యభావంబుతో నన్ను
రక్షింపనూహింప నీరీతిఁ బ్రత్యక్షమైనిల్చి బ్రహ్మాదులున్ సిద్ధ
యోగీంద్రులున్ గానలేకుండు నీపాదకంజాతయుగ్మంబు వీక్షింపఁ
గాఁ జేయుటం జేసి నేధన్యతం జెందితిన్ బూని లోకంబులున్ సత్ప
దార్థంబుఁగానంగలేకుండు చందాన నత్యంతమాయాంధకారంబు
చేఁజిక్కి నిం గానఁగాలేక దైవంబు లంచున్ వడిన్ రాలనెల్లన్
సమర్చించి యందేమియున్ మేలునొందంగ లేకుండు రెంచన్

ఘనుల్ గొంద ట్టిమ్మైననుజ్ఞానదీపంబు దీపింపఁ
గాంచి వాంఛార్థముల్ గొందు రానందలీలన్
గొల్చి మున్ముక్తి కాంతామణిం జెంది శశ్వద్విభూతిం బ్రకాశించు
చున్నట్టిసద్భక్త సంఘుంబులంబోలె నన్నుం గృపాదృష్టి నీక్షించి
రక్షింపు మీశా! వియత్కేశ! పాపౌఘనాశా! నమస్తేనమస్తేనమః

క. ఇచ్చెద నేవరమయినను
హెచ్చుగఁ బ్రార్థింపు మిప్పు డిమ్మగ మీాశ్రో
నెచ్చటనైనం దుల యన
వచ్చు నిజం బైనభక్తవరు లిలఁ గలరే? 195

చ. అడిగిన లేదటంచు విడనాడక నీదగుభక్తి చక్కఁగాఁ
గడు గడముట్టఁ జేసితివి కౌతుకముం జెలువార మేలు నీ
పడఁతిని వారకాంతఁగను బ్రాఢి నొసంగితి నన్న సంశయం
బుడుగుము ధారుణీతలవరోత్తమ! నిక్కము మానసంబునన్. 195

తే. సుతుఁడ నైయుంటి నీ కిపు డతులితముగ
జనకుఁడవు నీవు నీసతి జనని మాకుఁ
దిరముమిాఅంగ నమ్ముమాదేవతోడ
సాటిసుమ్ముధరిత్రీశ! సేటుసేయ! 197

చ. అని కృపఁజేసి శంభుఁ డపు డంబిక కిట్లను నోవెలంది! యి
య్యినకులనాథుచంద మిపు డిమ్మలరం గనుఁగొంటె! నేను వే
శ్యను వెసఁ గోర నియ్యకొని సద్గణికాంగన గల్గకున్నచోఁ
దనకులకాంతనే యొసఁగెఁ దథ్యముగా నెలయింతిబాగుగన్. 198

క. ఇతఁ డింతవిరహమోగుం
డితనికి మనలోక మిప్పు డిత్తమె యనినం
బతిపల్కులు తగ విని పా
ర్వతి దా నిట్లనియె మిగులఁ బ్రమదముతోడన్! 199

ఇందుకిరీట ! నీకేభక్తవరుఁ డైనఁ
బ్రాణం బొసంగును భాగ్య మొసఁగుఁ
దలఁ దెంచి యొసంగును లలిఁ దనూజునిఁ గూరఁ
గా వండి యొసఁగును గానియిటుల
మానంబు దిగనాడి మానిని నీరాదు
మాన మిచ్చుటఁ జేసి మాన వేశుఁ
డధికనిశ్చలభక్తుఁ డత్యంతసజ్జనుం
డితనికి మనలోక మీయవలయు

తే. ననిన శర్వాణిపలుకుల కలరె నభవుఁ
డంత మునులును బ్రహ్మాదు లభినుతింపఁ
దొగలుముకుళింపఁ బద్మముల్ దగహసింప
ధరణియుదయాద్రిపైఁ దోఁచెఁ దత్క్షణంబ. 200

సీ. దివి నప్సరోజనుల్ దవిలి నృత్యం బాడఁ
గర మొప్ప గంధర్వవరులు పాడ
సకలదేవతలును బరికించి పొగడంగ
శుభలీల దివ్యదుందుభులు మ్రోయఁ
బుడమి నెల్లెడలను బుష్పవర్షం బొప్ప
నరు లెల్లఁ దలలెత్తి యరసిచూడ
భళ్యాణధరణీశుభామల నిరుపమ
భర్మవిమానంబుపైని వేడ్కఁ

తే దనర నెక్కించుకొని కడు ఘనతమీఱఁ
బూని భల్లాణుతో జగంబులునుతింపఁ
దనరవృషభేంద్రు నెక్కి భూతలమునుండి
భవుఁడు వేంచేసెఁగైలాసభవనమునకు. 2

సీ. అని నయ్యాశ్వరుం డానందచిత్తుఁడై
గౌరియుం దానును ఘనతతోడ
భల్లాణభూపాలుఁ బ్రమథులలోఁ బెద్దఁ
గాఁ జేసి పట్టంబుగట్టి మిగుల
మంగళగీతంబు లంగనల్ వెసఁ బాడ
శంఖాదిరవములు సరవి మ్రోయ
నిరుగడ బ్రహ్మాదిసురలు సేవింపంగఁ
బ్రమథగణంబులు బలిసి కొల్వ

తే. రమణతోఁ దాను తగ పరబ్రహ్మ మగుచు
జగములన్నియు నేలుచు శాశ్వతముగ
రత్నసింహాసనస్థుఁడై రాజసమున
నవిరళం బగుసుఖలీలఁ దవిలి యుండె. 202

సీ. అనుచు సూతుఁడు నైమిశారణ్యవాసులై
యలరుచుండెడు శౌనకాదులకును
రమణీయ బసవపురాణోక్తమైనయీ
భల్లాణరాయభూపాలచరిత
వినిపించుక్రమమును బనిమీఱ నానేర్చు
విధమున రచించి విమలభక్తి
దనర మీకొసఁగితిఁ దగ మీర లిందుల
తప్పుల క్షమచేసి దయదలిర్ప

తే. నిమ్మహాకావ్య మెప్పుడు నిద్ధరిత్రి
నేర్పుతో విస్తరిల్లి బుధేంద్రులెల్లఁ
బొగడ నాచంద్రతారార్క మగుచునుండు
నటుల నొనరించి మముఁ బ్రోవుమయ్య శర్వ 203

గృతులిడయి
ధ...ంగవివరులు సంపదలఁ బొందుదురా
నెఱినిహాపరసుఖములకై
యుఱుబుద్ధినినీకుఁ గావ్య మొసఁగితి నభవా! 204

క. ఈకథ౦జదివిన వ్రాసినఁ
బ్రాకటముగవినినయట్టి భవ్యులకెల్లన్
శ్రీకరముగ నభిమతములు
చేకుఱఁగాఁజేసి కరుణఁజేయుమనంతా 205

వ. అని యివ్విధంబున విన్నవించి.

క. కరతలధరితకురంగా!
చిరతరకరుణాంతరంగ! సింధునిషంగా!
కరిదనుజమదవిభంగా!
గురుజన హృత్పద్మభృంగ! కుక్కుటలింగా. 206

మణి. మురహరశరవర! మునిజనశరణా!
సురవరనరద! కుసుమశరహరణా!
చిరతరగుణ! విలసితకరహరిణా!
పరమపురుష! నిరుపమశశిధరణా! 207

మాలిని. సదమలతరరూపా! సర్వలోకప్రదేపా
ముదితబుధకలాపా! ముఖ్యసత్యానులాపా!
విదళితఘనతాపా! విశ్రుతోద్యత్ప్రతాపా!
కదనతలకోపా! కాంచనాహార్యచాపా! 208

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాద లబ్ధ
ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యగోత్ర పవిత్ర
గంగనామాత్యపుత్ర బుధజన విధేయ తిమ్మయాఖ్య నామ
ధేయ ప్రణీతంబైన రాజశేఖర విలాసం బను
మహాకావ్యంబునందు సర్వంబును దృతీ
యాశ్వాసము సంపూర్ణము.

శ్రీ సుజనరంజని ముద్రాక్షరశాల, రాజమండ్రి.

# సతీ—అనసూయ

అనసూయ మహాపతివ్రత—పతివ్రత యేగాదుపరమపావనచరిత్ర—పతితపావనచరిత్ర యేగాదు—పాలకుల బాలకులజేసిన సాధ్వీమతల్లి—సాధ్వీమతల్లి యేగాదు—సతులకుగతులుకల్పించు పతిభక్తి నూరిపోసిన జగద్విఖ్యాత యశోడిండిమము—తనయశోడిండిమముదశదిశలమ్రోగ ముగురాడువారికి అత్తగాపరిణమించినఅగ్రగణ్యచరిత్ర—సరస్వతికి నీతి జెప్పి, లక్ష్మికిబుద్ధిచెప్పి, పార్వతికిపంతంబులుపనికిరావనిచెప్పి బాలకుల పాలకులుగాజేసి యిచ్చిన నిష్కళంకపూతచరిత్ర—అటిఅనసూయదేవుని ఋంచినదేవుడై, బాలుల పెంచుటకుపాలకురాలై, మహాసాధ్వియై, త్రిమూర్త్యాత్మకంబునకు తల్లియై, పాతివ్రత్యము భగవంతుడు తలదన్నునని చాటుటకో మన భరతఖండ భాగ్యరాశి చరిత్ర యొకసారి చదువుడు, చదివి యానందింపుడు.

వెల 0—12—0



# సతీతులసి

బృందయొక్క పాతివ్రత్యము, నామెభర్తయొక్క దుండగములు, జలంధరుని వేషముతో విష్ణుమూర్తి బృందకడకరుగుట, బృందపైయతని మోహము, తులసివృత్తాంతము మొదలగునవి చదివితీరవలెను.

వెల రు1—0—0



120

# శ్రీనాథకవి చరిత్రము.

వద్దూరి శ్రీరామమూర్తి గారి విరచితము.

ఏకవిసార్వభౌముడు శృంగార శ్రీనాధుడనుబిరుదముకు సంపాదించెనో, ఏమహా కవిసార్వభౌముడు తనవిద్యగళకవితాప్రభావమును ప్రపంచంబున వర్షధారాపాతముగ వర్షించి దేశజుల మన్ననంబులకు బాత్రుండయ్యెనో ఏకవిమండితుడు తన దేశ ప్రభావంబెల్ల జూపు నైషధంబనుపేర నిషధేశ్వరుం డగునలుని చరిత్రమును వర్ణించి జగత్కీర్తిగాంచి తరించెనో ఏకవితల్లజుం డనవరతంబును దేశపర్యటనంబొనరించుచు వివిధవర్ణనలతో వీధినాటక మనుపేర రచించి పండితపర్యులచేతను పామరులచేతగూడ నతికెక్కగలిగెనో యట్టి శృంగారశ్రీనాథుని యద్భుతచారిత్రమిందు విపులముగా వర్ణింపబడినది. కవితియతరాసునికరంబునను వెలుగొందవలసినగ్రంథరాజమిది, ప్రతిచదువరియును చదువవలసినది, చదివి యానందింపవలసినది, మూలమూలలనున్న గ్రంథరాజములనుండి తాళపత్రగ్రంథములందు దాగియున్నవానినుండి చాటువులూరజేయు పద్యంబులన్నిదీసి వాటివాటికి సంబంధించిన కథలన్నియు సేకరించి విశేష ప్రయత్నములకోర్చి రచియింపబడినది. ముద్రింపబడిన 2 మాసములలోనకే ప్రతులన్నియు జెల్లిపోవుటచే ద్వితీయముద్రణముగూడ నయినది. ఎల్లవారును ఏమహాకవిచారిత్రమును జదువుటకై యుబలాటపడుచుండిరో యాగ్రంథమిదియే త్వరపడుడు—

వెల 1—0—0